# మహానంద.

[శివపురాణాంతర్గత భక్తిరస ప్రధాన నాటకము.]

టి. వి. రమణయ్య అండ్ బ్రదర్సు వారిచే

ప్రకటింపఁబడినది.

సోలు యేజంటు

కొండపల్లి-వీరవెంకయ్య

బుక్సెల్లరు, రాజమండ్రి.

గ్రంథకర్త,

కొడాలి సత్యనారాయణరావు

మొదటికూర్పు 1000 ప్రతులు.

కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1924.

 [వెల రు. 1—0—0

# పీఠిక.

నేను కార్యాంతరమున రాజమహేంద్రవరమునకుఁ బోయినపుడు కొందరు మిత్రులు భారత సినీమా ప్రదర్శనమునకు బలవంతపరచి గొనిపోయి యీకథనుజూపించిరి. పిమ్మట నీగాథను దృశ్యప్రబంధముగ రచింపుమని ప్రోత్సహించిరి. అసమర్థతనైనఁ దలంపక నేదోయొక విధముగ రచియించి యాంధ్రలోకమున కంపుకొంటిని. గుణగ్రహణపారీణులు లోపములనే ప్రధానముగ విమర్శించరుగదాయన్న విశ్వాసమున ధైర్యమునసుంటిని. కథ నూతనంబయ్యును భక్తిరసప్రధాన మగుట పాఠకమహాశయుల కానందముఁ గూర్పఁగలదని నమ్మెదను.

ఇట్లు,
గ్రంథకర్త.





# ఈ నాటకమునఁగల పాత్రలు.

1. వేశ్యమాత.
2. మహానంద.
3. నారదుఁడు.
4. ఇంద్రుఁడు.
5. శివుఁడు.
6. దేవకన్యకలు.
7. దాసి.
8. పార్వతి.

పాత్రలు బహుస్వల్పంబుగనుండుటఁ బ్రతిసమాజమువారును బ్రదర్శించి ప్రజలమనంబున కీశ్వరభక్తిని బ్రబోధింతురుగాక.





శ్రీ

# మహానంద.

## నాంది.



గీ. ఇహసుఖంబుల కాసనింతేనిఁ గోరక
పరసుఖప్రాప్తికై పాటుఁ బడెడువారి
నాదరించియభీష్టంబు లమరఁజేయు
పార్వతీపతి మిమ్ముఁ గాపాడుఁగాత.

(నాంద్యంతమున సూత్రధారుఁడు) సదస్యులారా! కదళీపురనివాసియు విద్వజ్జన విధేయుఁడును కొండాలివంశ పయః పారావార రాకాసుధాకరుఁడును వేంకటహనుమంతరాయామాత్య తృతీయ తనూభవుండును నగు సత్యనారాయణశర్మచే రచింపఁబడిన యెనిమిదవ నాటకంబై భక్తి రసప్రధానంబై యలరారు యీ "మహానంద"యను నూతననాటకంబును తమ సమక్షంబునఁ బ్రదర్శింప నాభగవానునివల్లఁ బ్రబోధింపఁబడి నలయు పాత్రంబుల నాయత్తపఱుప మీయాజ్ఞను గూడఁ గైకొన నిటకు విచ్చేసితి. కాన నాకు సెలవొసంగిన నాటక ప్రారంభమునకై గడంగెదఁగాక.

(నిష్క్రమించును)





శ్రీ

# మహానంద.

ప్రథమాంకము.

ప్రవేశము:—మహానంద (శివపటమొడిఁగటఁ బెట్టికొని)

శివ శివా! పరమేశ్వరా! బూతులజాతిలో నన్నుఁ బుట్టించినది మాతల్లి వలన నిర్బంధింపఁబడుటకేనా! నాకీ సౌందర్యమొసంగినది నన్ను రట్టుల పాలొనర్చుటకేనా? నాకీ యంగసౌష్టవమిచ్చినది నన్ను మోహవిభ్రాంతులై మూర్ఖత్వమున మెలఁగువారి దృష్టులకు లోఁబఱచుటకేనా! నాకీకంఠమాధుర్యమబ్బఁజేసినది సిగ్గుల విసర్జింపఁజేసి నలువురిలోఁ దైతక్కలాడించుటకేనా? నాకీజన్మ ప్రాప్తింపఁజేసినది దయాసత్య శౌచాదులకు దూరమగునట్లు జేయుటకేనా? మాది ఆర్యసంతతికాదా! ఆర్యావర్తమున నివసించుచుండి ఆర్యుల ధర్మవిరుద్ధ ప్రవర్తనమొనర్చుట దూష్యముకాదా? భారతజాతికిఁ దలవంపుకాదా! మానాభిమానంబులఁ బరిత్యజించి దినములకొక్కొక్కనికీ పాడుశరీరము నమ్ముకొనుచు జీవించుట యేహ్యముకాదా? మాజాతి నేల నిర్మింపఁజేసితివో నీవెఱుంగనిదియా! నిన్ను సేవించుటకు సుమా! నిన్ను భజించుటకు సుమా! నిన్నారాధించుటకు సుమా! మాజన్మల ధన్యముగావించు కొనుటకు సుమా! అంతియేగాని యీవిపరీత ప్రపంచంబునఁ బాపంబు కార్యంబులనెడిఁ దగులొక్కొని ధనధాన్యపరిచయ దాహ బాసలకు లొంగు

టకుఁ గాదుసుమూ! తండ్రీ! సదాశివా! కన్నులఁదెఱచి యీదీను రాలి మొరాలింపుము. మహాత్కృష్ట కార్యాచరణమునకు నన్నుఁ బురిఁగొల్పుము. నీభజన చేయుచుకొననిమ్ము. నీసేవ లొనర్పనిమ్ము. భవదీయ నామామృత రసాస్వాదన మొనర్పనిమ్ము. నీపైఁ బాటలఁ బాడుటకు నానోరూరుచున్నయది. నీచరణములకు మ్రొక్కులొనరింప నాహస్తంబులు తొందరించుచున్నవి. నీ సుందరవదనారవింద దర్శనంబు నకై నానేత్రములు నిరీక్షించుచున్నవి. త్వన్నామమంత్రపఠన మొనర్ప నామానసము వేగిరించుచున్నయది. దీనదయాళూ! ఆపద్బాంధవా! శరణాగతరక్షణబిరుదాంకా! సదాశివా!

మ. పరిశీలింతువదేల నామనము దే ౹ వా! యెంతదానన్ భవ
 చ్చరణాబ్జంబులె నమ్మి యింతదనుకన్ ౹ సల్పన్ మహాపాపముల్
 దురితధ్వాంతనటంచు పేరు నెడ ౹ కాలుండిచ్చు నాశతులన్
 భరియింపన్ గడు శూర్తుటంబగుఁగదా ౹ స్వామి! రక్షింపుమా.

వేశ్యమాత—(ప్రవేశించి) అమ్మాయీ! ఇచ్చటనొంటరిగా నేమి
 చేయుచుంటివమ్మ.

మహా—ఈశ్వర ధ్యాన మొనర్చుచుంటినమ్మా.

మాత—ఈశ్వర ధ్యానమునకుఁ గాలనియమము లేదాయేమి? అన్న పానీయములు గూడ విసర్జించుకొని యీపిచ్చిలోఁబడితివేమి?

మహా—తల్లీ! ఆపార్వతీవల్లభుని భజించునపుడు అన్నపానములమాట స్ఫురించునా? బంధుగులు జ్ఞప్తికివత్తురా! భాగ్యభోగములవిష యములుఁ దలపునకువచ్చునా? ఆసదాశివుని నామమంత్రపఠ నమునకుఁదృప్తికలుగదు. కలుగదు. ఆసమయంబునఁగలుగు ఆనం దపారవశ్యమునకంతులేదు. అంతటిమహానంద సాగరంబున నోలలాడువారి చిత్తంబుల నన్యంబులాకర్షించుట కల్ల. కల్ల.

మాత—ఇట్లయిన నెటులఁగొట్టుకొందునమ్మా! వంశభూషణురాలవు జన్మించితివి. నాదరిద్రము విచ్ఛిన్నమయ్యెనని యెంతయో సంతసించుచుఁ గడుఁగారామున నోముచు నీకొఱఁకంత లేసి కష్టంబులనుభవించిన నాయాశల ఫలితమిదియేనా? తల్లీ!

సీ. కాలు నేలను మోప । కందిపోవుననుచు
బరపించినాను తివా । సులింట
నొత్తుకపోవుని । మెత్తనిమేనంచు
బరపించినాను మేల్ । పక్కలింట
అరికాళ్లు మన్నగు । నంచు నల్దిక్కుల
బరపించినా నింట । బలకరాళ్ళ
యిష్టంబునీకని । యెఱిఁగి యూటను యింట
చెక్కించినాను । బచ్చిసుపాలె.
కొఱఁతలేకుండ సర్వంబు । గూర్చినాను
తగిననాధారు రాలవై । తనరెదంచు
నెంచి నేనెంతయో సంత । సించుచున్న
దానిఫలితమె యిది ముద్దు । తనయ చెపుమ. 2.

మహా—అమ్మా! నీవు నాకుఁగొఱఁతలేకుండ సర్వసౌఖ్యంబులఁగూర్చితివందు సంశయమే లేదు. కాని యిహలోక సౌఖ్యంబులయందు నాకిచ్ఛ జనింపకున్నయది. అందులకు నేనేమి చేయను తల్లీ! జగద్భద్రి సంధాయకుఁడగు నాసర్వేశ్వరుఁడు.

మ. తను వేనిచ్చిన దానికిఁక ఫలితమై । దైవాఱు మన్నామచిం
తనముఁజేసి తదన్యసౌఖ్యముల । బొందఁ బోకమోక్షంబొగిఁ
గనుటల్ నీవిహలోక తుచ్ఛసుఖముల్ । గైకోఁదలంపూనకో
వనితా! దోషము దోషమంచెపకు । సెప్పఁ సాగ నోతల్లిరో. 3.

నాజననంబునకుం గారణభూతుండైన యమ్మహామహుని యాజ్ఞశిరసా వహింపవలయునే కాని మీఱఁదగునమ్మా! బ్రతికిన నాల్గుదినంబు లీతుచ్ఛసౌఖ్యంబుల యందు నిమగ్నులమై యీపరమేశ్వరనామోచ్చారణమే తలపెట్టమిచో మన మధోగతి పాలుగామా? తల్లీ! నన్నేలహీనంపు కార్యంబులఁబ్రవేశపెట్టెదవు? ఇప్పటికైనను యీవేశ్యకులమున కొక గుణపాఠముఁజెప్పనిమ్మా.

మాత—అమ్మా! కాలమునననుసరించి యీమువారి లోఁగులధర్మముల యందు నీయంతటిది లేదనియు నమ్మ గడించినదాని కిబ్బడిగ డాచి పూర్వుల పేరు నిలిపెదనియుఁ బేరుప్రతిష్టల నార్జించవలయునేగాని తదేకనిష్టగా నీశ్వరునే భజించుచుఁ గూరుచున్న ముందుసంగతి నాలోచించగలవా? ఈధన మెంత కాలము తింటుము. మన యావదాస్తియు పట్టిపోయినపుడునాడు మనకు యీశ్వరుఁడిచ్చునా?

మహా—లేని యనురాగంబులఁజూపి, యసత్యములకు నప్రమాణము లకు తలయొగ్గి, వారివీరిని మోసగించి రోగములపాలై కొఱ మాలిన చావుపొందుటకన్న నిర్మలచిత్తంబున నాసర్వేశు నారాధించుమేని వలసినకోరికలఁదీర్చును. శాశ్వతానందపదవి జూపును. అజ్ఞానాంధకారమును బటాపంచలు గావించును. పాపపుంజంబులఁ బాఱఁద్రోలును. అట్టిమహామహుని నామోచ్చారణ విసర్జించి యీతుచ్ఛ సుఖంబులకుఁబాటుపడుమనుట నీకు ధర్మమగునమ్మా!

మాత—కుమారీ! తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్ళను వాదము నెవ్వరు పూర్వపక్షముఁ జేయఁగలరు? నవమాసంబులు మోసి కని పెంచి యల్లారుముద్దుగాఁ జూచుకొనుచుఁ గోరిన నగలను కోరిన వస్త్రములను యింకెన్నిటినో సమకూర్చి సూర్యరశ్మి

యెట్టిదో యెఱుంగక గాపాడిన నన్ను నాహితోక్తులను ద్రోసిరా జనుట నీకుధర్మముగాఁగానుపించినదా! నేర్పించిన విద్యాబుద్ధు లీవిధంబుగఁ బరిణమించినవా?

మహా—తల్లీ! నేర్పించిన విద్యాబుద్ధులట్టివి గావు. నేనుపఠించిన యే గ్రంథమునందును వ్యభిచారవృత్తి యుక్తమని గాన్పించలేదు. పాఠశాలలయందట్టి విద్యల నేర్పలేదు. తల్లివి నీమాటను జవ దాటుట నాది దోసమని నేనెఱుంగకపోలేదు. కాని యుక్తాయు క్తవిచారణ మక్కఱలేదా యంటిని. భావిదశను గూర్చిజూచు కొనవలదా యని విన్నవించితిని. ఈశ్వరోపాసన మవశ్యకర్త వ్య మీమానవజాతికని మనవిఁజేసితిని. సాధారణనేరములకు నిహంబున రాజదండనయుఁ బరంబున యమదండనయు మా త్రమే పొందుచుందురు. వ్యభిచారమువలన యనేక రోగముల పాలగుట యను మూఁడవశిక్షను గూడ పొందవలసి వచ్చును సుదని యిప్పుడు మఱలఁజెప్పకొనుచుంటిని. అమ్మా! నాకే గాదు నావైదికవర్గమున కేనియు నిట్టియవమానకరమై యసహ్య మై నిందనీయమై పాపహేతువైన దనరారు పాడువృత్తి వలదు. వలదు.

మాత—కూతురా! నామాట వినుము. రూపరేఖా విలాసంబుల యం దసమానురాలవని విఖ్యాతి గడించి సంగీత సాహిత్యముల యందు మిన్నవని పేరువడసి కులంబున మణివై విరాజిల్లు నీవురానున్న సిరిసంపదల నేలపాడుఁజేసికొనియెదవు. సౌందర్య ముఁగలిగి నందులకు సాటివారిని మోముపైఁ దన్నినట్లుగ గడించి పోయవలయును. నిజమువిచారించుము. నాహితోక్తులొక్కింత నాలించి విశేషకాలము శ్రమపడ నక్కఱయేలేదు. ఒక్కయే డాది నాచెప్పుచేతల మెలంగినఁ దల్లీ! లక్షలు గడింపవా?

మహా—అమ్మా! గడింతు ననుకొందము.

గీ. తనువు చాలించువేళను । ధనము మనము
వెంట మూటఁగట్టుకపోవ । వీలుపడునె?
అస్థిరంబగువస్తువు । నందునాశ
నేఁగలిసిఁపొంద మనము । సహించునమ్మ.

తల్లీ! వేమాటలేల! నావిన్నప మాలింపుము.

మ. ధనమే శాశ్వతమంచు నెంచుచు సదా । దౌర్భాగ్యకృత్యంబులం
దునఁ బుద్ధిన్ జొరనిచ్చి యా యమునిముం । దున్ పొందఁగాజాలనే
ఘనకష్టంబులఁగాన చిత్తమును దు । ర్గానాథుపైనిల్పి యా
తని పాదద్వయమ్మున్ భజించెదనుమా । తా! మోక్షసంప్రాప్తికై.

మాత—తల్లీ! నామాటవినవా? నలువురిలోఁ బరిహాసింపఁబడుచుఁ జవఱకు దిక్కుమాలినచావు చావవలసినదేనా?

మహా—అమ్మా! ఏలయీవృథాకంఠశోష! ఈజవ్వనమనునది జననము తోడరానిది. మరణముదాక నిలువనిది. ఇట్టి చంచల స్వభావముగల దానిని స్థిరపదార్థమని యెంచి పాపకార్యంబులకుఁ బురిఁగొల్పుచువే? యేమని కొట్టుకొందును. మాతా! అనరాదు గాని నాయమూల్య కాలమును వృథాప్రసంగంబునఁ బాడు చేయుచున్నావుకదా! గడించిన దేమియో గడించితివి? తిరిగిన దేమియో తిరిగితివి! అంమల సారస్యంబును గ్రహించితివి! ఈవిధిని దేహపటుత్వముఁజెడి లేవ సత్తువలేక యుంటివి. చివఱకు మాకుగూడ నిదియే గతిగదా! స్వానుభవంబున వ్యభిచార పర్యవసానమును గ్రహించియు నిట్టియుపన్యాసమే యిచ్చుటకన్న యిందలి ఫలాఫలితములను కులస్థులను రప్పించి ప్రబోధించి సన్మార్గ శీలురఁ గావించరాదా! వైవాహిక విధిని నాచరణలో బెట్టించరాదా! పాతివ్రత్య ధర్మంబులనుగూర్చి

యుపన్యసింపరాదా! దయా సత్యశౌచాదులను గూర్చియు, నీశ్వర ధ్యానమును గూర్చియు మహామహుల విరచిత గ్రంథం బులఁజదివి వారికి వినిపింపరాదా! తన్మూలమున భరతమాతృ చింతానలంబార్ప యత్నించుట యుత్తమముగాని యనేక విధ ములఁగృశించి కన్నీరు మున్నీరుగా విలపించు మాతృస్వరూపి ణిని మఱింత యధోగతికిఁ దెచ్చుట పాడియా!

మాత—కూతురా! చివఱకు నీకు నేర్పించిన చదువేవిధముగాఁ బరిణ మించినదే? నామాట కాదనవంచు నెంచి యెంత నేర్పుగా మంద లించినను కార్యము లేకపోయె. అతిగారాబమునఁ జూచుట చేత నేగదా కాఠిన్యము వహించుటకు మనంబొప్ప కున్నయది. నామెత్తదనమే నన్ను మోసగింపబడనైచినది. ఆహా! ఎంతయోగ్యు రాలవైతివి. నీమూలమున వేశ్యకులమెల్ల నుద్ధరింపఁబడును గాఁబోలు. గణికాకులంబున వివాహ విధులు పెచ్చుమీఱు ను గాఁబోలు. ప్రపంచమంతయుఁ దలక్రిందులుచేయు నేర్పు నీకడను గలదు కాఁబోలు. అమ్మమాట యందెంత విలువ నుంచితివి? పెద్దల సుద్దుల శిరసావహించ వలయునను నీతిని పఠించ లేదా? దైవతుల్యురాలను హితమెచటను రచింపఁబడి యుండలేదా? వేశ్యలకు వివాహవిధి యేధర్మశాస్త్రమునందేనిఁ బఠించితివా? ఆహా! ఏమి నీ తెలివి తేటలు.

మహా—అమ్మా! నీప్రశ్నలకు సదుత్తరంబులీయ సమర్థురాలనయ్యు నయ్యది తిరస్కృతములుగాఁ బరిణమించునేమో యనియు, నీవీనులఁ జొరునా యనియు భయపడుచున్నదానను. పెద్దల సమక్షమునఁగూడ ధర్మమును బ్రకటించుటయందున్న దోషమే మియునుండదను ఆర్యులవచనంబు లాధారపఱచుకొని వచింతు క్షమింపుము. ఈశ్వర సృష్టియందు వ్యభిచారమునకని

ప్రత్యేకముగా నొకకులము నిర్మింపఁబడి యుండలేదు. బణ్యాంగనలనుగూర్చి మన బల్లిదుల యభిప్రాయము వేఱు. దేవస్థానములయందు నాట్యాదికములఁ గావించుచు ధనికులచేత శాశ్వతముగా నీయఁబడిన మాన్యంబుల వలనవచ్చు నాదాయమును ననుభవించుట యనియే వేశ్యజాతి ఉత్సవముల యందును, వివాహాదుల యందును మేళములు కుదిరి రొక్కంబును గడించుకొనవచ్చును. జారవృత్తిహీనమని నిందించు వారీవృత్తి యేలసమ్మతించిరని కొందఱకు వాదములకిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి పురుష కంఠముకంటె స్త్రీకంఠమునందు మార్దవమును, మాధుర్యమును ఎక్కుడుగాఁ గలదనియు, విబుధజనరంజకముగ నుండునవనియు ఉత్సవాది సమయంబులుల్లాసకరంబులగుటచే నాకాలమందుఁ జేడియలు పాడుటచే నింక నాయానాదమునకు మేఱలేదనియు, నేత్రహస్త. పాదాభినయంబులచే హావభావ విలాసంబులఁ జక్కఁగాఁ బ్రకటించుశక్తి వీరికనే గలదనియు వారియూహ. కులకాంతలు రచ్చలకెక్కి భరతశాస్త్ర ప్రావీణ్యతను జూచుట కవకాశము లేకుంటచే సర్వస్వతంత్రులయిన కాంతలుండుట ఆవశ్యకంబని యట్లొనర్చిరి. అందుచేత నేగదా వ్యభిచారమునర్చి చెడకుండ నుండుటకుఁ బ్రోత్సహింప మనపూర్వులు స్త్రీపరంపరయందే వంశక్రమమున దాయము వచ్చుననియుఁ దల్లిసొత్తునకుఁ గూతులే కర్తలుగుదురనియుఁ గట్టుబాట్లుఁ జేసిరి

మాత—అబ్బా! ఏమియుపన్యాసముఁ జేయుచుంటివి. సంఘసంస్కరణ కర్తలమని క్రొత్తగా బయలువెడలిన షండుల వాక్యములా యివి!

మహా—హరహరా! తల్లీ! మనకార్యముల నిరసించువారు షండులా!

మనగుమ్మములఁ ద్రొక్కనివారు షండులా! నిష్కారణముగా దేశభక్తులను, సత్కురాచార బహిష్కార ప్రబోధకుల నీవిధంబుగ దూషించుట మహాపాతకమమ్మా!

మాత—ఎప్పుడో పాతకము జుట్టుకొనునని ఎన్నఁడో యమదండనలు సంప్రాప్తమగునని యిప్పుడు యీతుచ్ఛికమందు రానున్న ఐశ్వర్యమును జెడఁగొట్టుకొనిన మందురా లెవరైనఁ గలదా? యమదండనలు కన్నులారఁ జూచివచ్చి చెప్పినవారెవ్వరైనఁ గలరా? మనమా లోకచర్యలను దిలకించుచున్నామా?

మహా—పెద్ద యగాధములోనికి దింపుచుంటివేమమ్మా! యమదండనలు నిజమా! కల్లలాయను విచారణ మహాస్తుతము మాడు నీగతిని చెప్పుమమ్మా!

గీ. ఏబదేండ్లకె తొంబది । యేండ్లవొక్క
గతిని గాన్పింతు వీవేల? । కల్లునీళ్ల
కింత యూరాటపడెదవ । దేల? నల్ల
మందులేకుండ తీసవన్న । మెందుచేత?
చుట్టచెవియందునను నగ్గి । పెట్టి చేత
లేనిదే స్థాయిగా నిల్వ । లేవదేల?
దేహమందుఁ బటుత్వంబు । దినదిన మడు
గంటుటనుగాదె నీవటులుం । టఁదల్లి.

వరుస వావిలేక, దయాదాక్షిణ్యములులేక, ఒక్కరి యందైనను నిలుకడగల యనురాగములేక లెక్కకుమీరిన విటులతో సంచరించుట వల్ల నేగదా! తల్లీ, వివిధరోగములపాలై యిట్టులల్లాడు చున్నయది! ఈలోకమునకీశిక్ష చాలునుగదా! ఈకర్ణయుంబు లన్నిటికిని తేపు యముని సమక్షమున నిలువఁబెట్టి విచారించి శిక్షల విధించినప్పుడు మీరు మాటలాడుట కవకాశ మున్నదా?

మాత—ఇంతకూ యీధర్మోపన్యాసము లేకఅపుపెట్టుటయేగాని కుల వృత్తిలో మెలఁగి గౌరవకీర్తులు సంపాదింతువన్న యాశయము లేదన్న మాటయేగాదా?

మహా—అమ్మా! ఏలనన్ను పదింబదిగ రెట్టించియడిగెదవు. చూడుము.

గీ. సాటివారలు నవ్విన ׀ సర్వసంబు
క్షీణమైన నధోగతుల్ ׀ చేకుఱినను
యీశ్వరు భజించుటయె దక్క ׀ నితరములకు
పాల్పడను బాల్పడను నీదు ׀ పాదమాన.

మాత—నేనింకఁబోయెదను నీయేడ్పునీ వేడ్చుకొనుము. కన్నకడుపుగాన నిట్టు కొట్టుకొనుచును. కొట్టి తిట్టి బలవంతపఱచుటకు నీవేమి యవ్యక్తురాలవా?

మహా—తల్లీ! ఆగ్రహింపకుము. నీయాజ్ఞ విన లేదని నాపైఁగినుకవలదు.

గీ. దేహమస్థిర మాయువు ׀ దీర్ఘకాల
ముండగాఁబోదుమన మిల ׀ నుండుదాక
నేనియీశుని భజియించు ׀ మెటులనేని
ముక్తికాంతను బొందుట ׀ యుక్తమమ్మ. 8.

మాత—నీవుసన్యాసివై పోవుచున్నయది చాలక నన్నుఁగూడసన్యాసి నివి గమ్మని బోధించుచున్నావా! అమ్మా! చాలు. చాలు.

గీ. పాలరాళ్ళమిల్లు ׀ పసిడి గిన్నెలు పట్టి
మంచములును వస్తు ׀ సంచయంబు
యేవిధంబుగ నసి ׀ యింమనోయనినీకు
కన్నుగుట్టిపోవు ׀ చున్నదమ్మ 9.

మహా—అమ్మా! నేనుచెప్పు ప్రతిదియు నీకువిపరీతముగఁ బరిణమిం చుచున్నపుడు నేను నోరెత్తుట దూష్యముఁగాఁగలదు. జననీ! నీ యిచ్చవొప్పిన వర్తిలుము.

మాత—నాయిచ్చవచ్చినరీతిని నేనుండెదను. నీయిచ్చవచ్చినరీతి నీవు మెలంగుము. ఈవిషయమొకరు చెప్పెడిదేమున్నది. నాయాశలు నేలపాలైనవని నాకష్టములు నిష్ఫలలోఁబడినవని నాముద్దులు పదట గలిశినవని యేడ్చుచున్నానుగాని అంతకుదప్ప యితరమేమియులేదు. విన్నసరియే. వినకున్నసరియే. ఉండు ఈశ్వర ధ్యానముమీదనే వుందును. ఆతఁడే అన్నపానము లిచ్చును. ఆతఁడే నీమనోభీష్టము నీడేర్చును. నేను బోయెదను.

(నిష్క్రమించును.)

మహా—ఆహా! నాతల్లికింతటి పట్టుదల యేమిటకు? మలినపూరితమైయొప్పాఱు యీపాడుశరీరంబున కేమేమియో మెరుంగులు పూసి, ప్రపంచ మంతయు మనలను చూచియే భ్రమించవలె నన్నంతటి వన్నెచిన్నెలు ఘటించుకొని గపటాభినయంబులచేత మోసములకు, దురాగతములకు దిగనై తినట. జాతిమతధర్మంబుల నలక్ష్యము సేయవలెనట. ఈశ్వరోపాసనమునకిది తగిన కాలము కాదట. ఆమహానుభావుఁ డశక్తుఁడఁట. ఏమియు నొడఁగూర్పఁజాలఁడట. అయ్యో! ఎట్లు కొట్టుకొందును. తల్లీ! నీవిట్లు చెప్పుట ధర్మముగాదు. ఆర్యమతసాంప్రదాయవిరుద్ధము. నిక్షేపమువంటి శరీరము రోగముల పాలగును. మోసగతిచే నార్జించెడు ధనము చిరకాలము నిలువదు సుమా. అని యెన్నిరేమో విధంబులు గఱప నవియన్నియు విషప్రాయములుగఁ బరిణమించెనే? దైవమా! ఇంకేమిగతి! నీవేగతియనికదా నేనింక మెలంగవలసినది. సదాశివా! అట్లనే గానిమ్ము. అన్యగతి నాలోచింపను.

గీ. ప్రాణమానధనంబులు। పార్వతీ మ
నోహరా! డెంచమందును। త్సాహమూని

యర్పణ మొనర్చు చుంటి ద । యామయుండ
వగుచు నన్నాదరింపంగ । దయ్య తండ్రి.

మ. పరమేశా! గిరిజామనోహర జగ । ద్వంద్యా! యఘధ్వంసకా!
కరుణాసాగర! దీనపోషకుఁడ! దు । ర్గానాథ! శంభో! శివా!
పరిపాలింపఁగదయ్య దీనని సం । ప్రార్థింతు నన్యంబు ల
క్కఱయే లేదు నిజంబు నమ్మి గరుణన్ । గావంగదే శంకరా.

మహానుభావా! నాపై నీకుఁ బరిపూర్ణ వాత్సల్యము కుదురుటకు, నన్ను నీభక్తురాలిగ నొనర్చుకొనుటకు, నాచే నీచరణ దాస్యమనవరతముఁ జేయించుకొనుటకు, నీనామ సంకీర్తనము నానోటఁదనివితీఱ వినుటకు, నానిష్కల్మష చిత్తంబును నీవు పరీక్షించుటకు, నాకు నీయందు గాఢమగు భక్తి కుదురుటకు నాయనా! చంద్రశేఖరా! ఇదినీకుఁ దగిన స్థలముగాదు. నాకుఁగల సర్వస్వంబును వెచ్చించి నీకొక్క సుందర మందిరంబును నిర్మించి నిన్నందుఁ బ్రతిష్ఠించి యానంద పడుతును. సంతసింపుము.

దాసి——(ప్రవేశించి) అమ్మా! అమ్మగారు భోజనమునకు రమ్మనుచు న్నారమ్మా.

మహ——ఆ! వచ్చుచున్నాను.

(నిష్క్రమించుచున్నారు.)





శ్రీ

# మహానంద.

ద్వితీయాంకము.

శివాలయమ్.

[శివుని భజించుచు మహానంద ప్రవేశము.]

శ్లో॥ క్రీడార్థం సృజసి ప్రపంచమఖిలం క్రీడామృగాస్తేజనాః
యత్కర్మా చరితంమయాంచ భవతః ప్రీత్యైభవత్యేవతత్
శంభోస్వస్య కుతూహలస్య కరణం మచ్చేష్టితం నిశ్చితం
తస్మాన్మామక రక్షణం పశుపతే కర్తవ్యమేవత్వయా॥

గీ. నిఖిలమును వేడుకకె గదా । నీవసృష్టిఁ
జేసితివి యీజనాళి నీ । సేవఁగోరు
నట్టిక్రీడా మృగంబులై । యలరుచుండు
కాకిపిల్ల కాకికిముద్దు । గానఁగాను
బిడ్డలొనరించు చేష్టలు । ప్రీతినీకు
అందుచే నాదుచెయ్దము । లందునీకు
సంతసంబయ్యెడిని మద । నాంతకుండ
గాన నాదగు దోసముల్ । గాచు భార
మెల్లనీదియె యనివేడు । దేనునిన్ను
శరణమెవ్వరు నీకన్న । శంకరుండ.

ఓ సదాశివమూర్తీ! నీవ సన్నిధానంతునకు యీవిలాస మందిరమును నీకేర్పరచితి. అనుదినంబును నిన్ను భజించుచుంటిని. నీవిలాసమే నావిలాసమని యానందపడుచుంటిని. నీరక్షణం బొందినవారిలో నేనెంతదానను. మానవ మాత్రురాలను. సర్వలోకశరణ్యుండవైన నిన్ను ఏవిధంబుగం బూజించవలయునో తెలియక నిన్నేతీరున, నలంకరించవలయునో గుర్తెఱుంగక, నీకెట్టిభోగంబులం గూర్పవలయునో నేరక, నీవిధి పరితాప పడుచుంటిని. నీవిట్టులుండువని నీస్వరూపంబును తిలకించినం గదా. సర్వంబును గ్రహింపంగలుగుదును. ఓదేవా!

నార—(తెరలో)

శ్లో. మాకురు ధనజన యౌవనగర్వం। హరతినిమేషాత్కాలస్సర్వమ్
మాయామయమిదమఖిలంహిత్వా। బ్రహ్మపదాత్వం ప్రవిశవిదిత్వా॥

మహా—ఎక్కడిదీగానము. ఎవ్వరో మహానుభావులు వచ్చుచున్నట్లున్నయది.

నార—(ప్రవేశించి)

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం। నిస్సంగత్వే నిర్మోహత్వం
నిర్మోహత్వే నిశ్చలతత్వం। నిశ్చలతత్వే జీవన్ముక్తిః॥ భ॥

(స్వగతము) ఓహో! యేమి! ఈ తనూవిలాసము! ఈలేప్రాయమున నిక్కాంతామణి కిట్టి భక్తి జ్ఞానవైరాగ్యములు గుదురుట పరమాశ్చర్యకరము. వేశ్యకులమందం బుట్టినవారిలో నిట్టివిరాగిణు లీత్రిలోకములయందెందేని ముచ్చటకేనిం గలరాయని నేనప్పుడప్పుడనుకొనుచుందును. జగంబులకిది యొకగొప్పవిశేషము. ఈనారీమణి నిశ్చలభక్తినిగొందరి వలనంబరీక్షజేయించి యీబిడ్డకీర్తి నల్దెసలం బ్రాకునటులం జేసెదగాక.

మహా—మహానుభావ! నమస్కారములు. వచ్చి యిట్లులనే నిలువంబడితిరే!

నార—సుఖీభవ. సుఖీభవ. నీ భక్తిజ్ఞాన వైరాగ్యంబుల కచ్చెరువంది యట్టులనే నిలువఁబడితిని.

మహా—దేవా! కూర్చుండుఁడు.

నార—(కూర్చుండును.)

మహా—దేవా! తామెవ్వరో! ఎచటనుండి వచ్చుచుండిరో! తమనివాస మేదియో నెఱుంగ వినవర్తురాలనని తెలుపవేఁడెద.

నార—ఓమానవతీ లలామా! నేనా!

గీ. నారదుం డనువాఁడను । నాదు రాక
నాసుదేవునికడనుండి । వాసమెచట
యనుచుఁదెల్పుదు । లోకంబు లన్నినావె
చిత్తమెటఁగోరు నట । నివసింతుననబల.

మహా—అయ్యా! ధన్యురాలను ధన్యురాలను. దేవా! తమరాకచే నీదేవమందిరము పవిత్రమయ్యెను. నాజన్మము కృతార్థతఁ గాంచెను. బహుప్రియాస మోదినటుల మీముఖము వెల్పుచున్నయది. పాదంబుల నొత్తెద నిటుదెంచు మహాత్మా!

నార—వలదు. వలదు. నీవినయంబునకు సంతసించితి. వేఱుపరిచర్య లక్కఱలేదు.

మహా—పోనిండు రవంతసేపు వినరెవ నాజ్ఞనిండు.

నార—అబ్బా! అవసరములేదు. మార్గవశాత్తుగ నిటవచ్చుచుండ నీదేవళంబునుగాంచి చూచి పోదమని నిటువచ్చితి. నేనుపోయెదను. నీభజన గావించుకొనుము.

మహా—దేవా! ఎంతభజన. తమయట్టి మహాత్ముల పాదధూళిలో నొకయణుప్రమాణమైనఁ దుల్యముగాని నేనెంత! నాభక్తియెంత!

నార—ఓకాంతామణీ! భక్తికింతయని కొలతలేదు. గుణముప్రధానము. నిశ్చలత్వ మావశ్యకము. తత్త్వజ్ఞులు కొందఱు.

సంగము దొలఁగును । సత్సంగతిచే
సంగము తొలఁగిన । మోహమడంగును
తత్త్వము తెలియును । మోహమణంగిన
తత్వముఁ దెలిసిన । జీవన్ముక్తియె.

అని హితోపదేశ మొనర్చిరి. ఆపరబ్రహ్మము నెవ్వరేనిఁదలంచినను తత్త్వమెఱింగినచో వారు జీవన్ముక్తులగుట యథార్థము. ఇదియె పరమార్థము. ఆపరమార్థమెఱింగి పరాత్పరుని గొల్చు నీ పూజావిధానమరసి నేను మహానంద భరితుఁడనైతిని. గణికాన్వయంబున జనించియుఁ దుచ్ఛసౌఖ్యంబులఁ దగుల్కొనక భాగ్యభోగంబులఁ దృణీకరించిప్రపంచ సంబంధంబును విసర్జించు శాంతవారికి లభించును? నీచరిత్ర ముల్లోకంబులఁ బ్రాకి మాకులంబున లోకగుణపాఠముగా నుండఁగాత. ఆపరాత్పరుఁడు నిన్ననుగ్రహించుఁగాక. ఓసుగుణవతీ! నీపూజకు నేను భంగమొనర్చుట ధర్మముగాదు. నేనుపోయెదను.

మహా—దేవా ! అజ్ఞురాలను. తొలిపుట్టువునఁ జేసిన సుకృతంబులఁ బట్టి భవదీయ దర్శనభాగ్యంబు లభించినది. కాని మిమ్మేవిధాన గౌరవింప వలయునో తెలియనైతిని. నాయపరాధముల సైరింప వేడుకొందు.

నార—బుద్ధిమతీ! యిప్పుడుగౌరవములతోఁ బనేమియులేదు. నే నవసరంబుగ దేవేంద్రునితో సంభాషింపవలసిన పనియుండి పోవుచున్నాఁడను. ముందు ముందు సన్మానించవచ్చును లెమ్ము. పోయెదను.

మహా—దేవా! వందనములు.

నార—

శ్లో॥ కామం క్రోధం లోభం మోహమ్।
త్యక్త్వాత్మానం పశ్యతిసోఽహమ్॥

ఆత్మజ్ఞాన విహీనామూఢా
స్తేపచ్యన్తే నరక నిగూడాః॥ భ॥

(నిష్క్రమించును.)



## ద్వితీయరంగము.

[నందనోద్యానమున నింద్రుఁడును నారదుఁడును.]

ఇంద్రు—నారదా! అంత రూపవంతురాలా?

నార——దేవేంద్రా! ఎందుల కిన్నిసారులు నన్నుఁ బ్రశ్నింతువు? పోయి చూచి రారాదా?

ఇంద్రు—వినుచుండఁగనే యింత యబ్బురముఁ దోఁచుచుండ నింక ప్రత్యక్షముగఁ జూచిన నెట్లుండునో! నారదా! ఎప్పుడును యేదో యొక వింతవార్త చెప్పుచునే యుందువుగదా?

నార—ఎట్లుండునో చెప్ప నేల? ఆకాంతా రత్నమును జూచినచో మరల నీకీ నాకలోకము స్మరణకు వచ్చునా? మేము జ్ఞాపకములో నుందుమా?

ఇంద్రు—నారదా! గోరంతలు కొండంతలుగఁ జేసి చెప్పుటలో నీయంతటి ప్రజ్ఞావంతులు లేరుగదా!

నార—రూపము మాట యటుండనిమ్ము. ఆకాంతామణి భక్తి జ్ఞాన వైరాగ్యములు ప్రత్యక్షముగఁజూచి తనివి నందవలయునేగాని చెప్పనలవిగాదు. గణికయై ప్రపంచ సౌఖ్యంబుల విసర్జించి సర్వస్వము వెచ్చించి నిర్మించిన శివాలయము విలోకింప రెండు నేత్రములు నాకుఁ జాలవపోయినవిసుమా. సర్వనిఘంటుల నీ వదృష్ట వంతుఁడవు! వినుము నా?

గీ. వేయికన్నులదొరగప్పగా । వెలయుచుంట
నామెరూపంబు మఱియు । శివాలయంబు

దనివిదీఱఁగ గాంచి । నీతనువు ధన్య
పఱచెదవుగాదె । స్వర్లోకభర్త నీవు.

ఇంద్రి—నారదా! ఎంతమాట విసరితివి! నిజముగాఁబోయి చూచి రమ్మందువా?

నార—ఆకాంతను చూడనిహాని జన్మమేల యని వాదించగలను.

ఇంద్రి—అట్లైన నాకాంత భక్తిని బరీక్షించ వలసినదే.

నార—ఏవిధమున.

ఇంద్రి—భక్తిని భంగపఱచి.

నార—కామించియా!

ఇంద్రి—అవును.

నార—ఉత్తమకాంతలఁ గామించి తొల్లి నీవుపొందిన గౌరవములు స్ఫురణకుఁ దెచ్చుకొనినావా?

ఇంద్రి—నారదా! అవ్యక్తుఁడవగుచుంటివే! ఇక్కాంతామణి గణిక. పతిలేనిది. దీనికిని యూకాంతలకును హస్తిమశకాంతరము తారతమ్యము గలదు. ధనమున కాశింపని వేశ్యగలదా? స్వర్లోకసౌఖ్యము నిచ్చెదనన్నఁ గాలఁదన్నుకొనునా? విపరీతము లాడుచుంటివే! సామాన్య మానవస్త్రీ సురసామ్రాజ్యాధిపతి మనోభీష్టమును దిరస్కరించునా?

నార—బిడౌజా! ఆమహానంద నీకుఁ జిక్కదని నేను దృఢముగాఁ జెప్పఁ గలను.

ఇంద్రి—చిక్కిన!

నార—ఆజన్మాంతము నీపాదసేవఁ జేయుదును.

ఇంద్రి—చిక్కకున్న నేను—

నార—పాకశాసనా! అగుమాగుము. అంటిపెటపకుము. నీవు కంచె మీఁద నక్కఱలేదు. నీవు వెళ్ళినట్లుగ మఱల వచ్చుటయే పందెము. చాలును.

ఇంద్రు—నారదా! నాకుఁ బుద్ధి యెక్కించుట ప్రారంభించితివి. మానవులలోని నాకభోగముకాంతను నాకు లొంగునటులఁ జేయలేక పోదునా! అనసూయకన్నఁ బతివ్రతా శిరోమణియా గౌతము సతికన్న లావణ్యవతియా! చూచెదవుగాక. నావిజయము నచిరకాలముననే.

నార—కథావిధానము నీవు జరుపనుండ సవిస్తరముగ వినలేకున్నను సారాంశమునైన గ్రహింపలేకుందుమా!

ఇంద్రు—నారదా! మనకీ వృథావాద మెందులకు?

నార—అవును. నిజమే. నేను మరల దర్శించెదను.

ఇంద్రు—మంచిది.

నార—ఇంద్రా! ఒకసంగతి. భక్తులను పరిశోధించుటయే మనయట్టి వారి లక్షణము. దురాశచే వారల భంగపఱచుట సత్పథము గాదు. మనవిపరీత చర్యలవలన భక్తుల మనంబులు తల్లడిల్లి వారొక శాపవాక్కు విడచినచో నా బారినుండి తప్పించుకొనుట కెన్నియో యుగచాట్లు పడవలసి వచ్చును. ఎప్పుడెట్లో నేపాటున్నదో యని జాగ్రత్తగ మెలంగుట యుత్తమము. అవినీతుఁడవై వర్తించి లేనిపోని యాద్రినమును గొనితెచ్చుకొని పిమ్మట నారదుని నిందించిన ప్రయోజనము లేదు. కను మెలఁగి వర్తించుమని పదేపదే చెప్పుచుంటిని. పిదప నీయిష్టము. నేను పోయెదను. (అనినడచి తనలో) ఈతఁడు చపలచిత్తుఁడు. మహానంద పరమభక్తురాలు. ఈతఁడెట్టుల వర్తించునో! ఆమె యేక్రియ మెలంగునో! పర్యవసానమును వినఁగుతూహలపడుచుంటిని. నేనందాఁక విహరించుచు ఫలితమాలించి పిదప నేపోయెదఁగాక. (గానము జేసికొనుచు నిష్క్రమించుచున్నాఁడు)



4



శ్రీ

# మహానంద.

## తృతీయాంకము.

### శివాలయము.

[మహానంది పూజ సేయుచుండును.]

మహా—ఓ కైలాసవాసా! రంగద్విలాసా!

మ. దివిజుల్ సైతము నందనట్టి ముదమున్ । దేవా! లభింపంగఁ జే
యవె నాకంచు భజింతు నీపదము లా । హ్లాదంబునన్ గొల్తు నా
యవివేకం బడఁగారిపోవ భవదీయం । బైనమూర్తిన్ సదా
శివ! కన్గొనగను వేడుకొందు మఱి యా । చింతన్ సదాముక్తిగన్.

సీ. ముద్దుబెట్టుకఁబోవ । బుస్సుమనుచు లేచు
పాములే నగలుగా । బఱగునాట
దర్శించినంతనే । తల్లడిల్లఁగఁ జేయు
నల్లకాడే నీని । వాసమంట
కనుపించినంతనే । గగ్గోలుపఱచు పి
శాచములే పరి । చారకులఁట
ఏహ్యంబుగలిగించు । చెప్పకుంబుట్టిల్లు
పిచ్చంబుకై బయల్ । వెడలెదంట

గీ. పాత్ర లేదంట, లేదంట । బట్ట నొంట
చర్మమును దాల్తువంట ని । శాచపుంక
వంట నోమేమొ వచియించు । చుండి నిన్ను
గన్గొనంగ వేడుచుంటి । గంగాధరుండ.

ఇంద్రు—(దేవకన్యకలసహితుండై ప్రవేశించుచు)

(స్వగతము) ఆహా! నారదుడువక్కాణించిన దంతయు నిక్కంబ. పుట్టుకచేతనే భోగంపుకాంతయగుటచే రూపురేఖావిలాసంబులనుగూర్చి యంతగా గర్వింప నవసరము లేదుగాని యిక్కాంతామణి భక్తిజ్ఞానవైరాగ్యములనుగూర్చి మాత్రము నాకు పరమానందముగా నున్నయది. ఈమె శివధ్యానమునందు లగ్నమైయుండి యొనర్చుచుండిన గానము మదీయవీనుల కెంతయో విందు గూర్చుచున్నయది. ఔరా! కామక్రోధాది యరిషడ్వర్గంబుల నిర్జించి తాను వేశ్యయయ్యు యీనిండుయౌవనంబున నింత విరాగత్వంబును వహించుట గొప్పసంగతికదా! భారతభూమియందుం గనివిని యెఱుంగని విషయము. ఇప్పటి కామె యొక్క నిశ్చలత్వంబును తప్పకం బరీక్షించవలయునే కాని విడువ గాదు. నాయత్నంబున సఫలీకృత మనోరథుండ నగుదునేని నారదుని గర్వంబు ఖర్వంబుగ నొనర్చినవాండనగుదును. విఫల మనోరథుండ నగుదునా ఈమె భక్తిని మఱింత వృద్ధిజేసినవాండనగుదును. ఎట్లయినను మంచిదే. (ప్రకాశముగా) ఓ కామినీమణీ:—

మహా—(తిరిగిచూచి లేచి) ఆర్యా! వందనములు. తామెవ్వరు? ఎందుండి యిచ్చటికి విచ్చేసితిరి?

ఇంద్రు—అలివేణీ! నేను త్రిదివసామ్రాజ్యరమావధూటిని బాలించు భర్తను. శ్రీమన్నారాయణున కగ్రజుండను. నన్నే దేవేంద్రు

డుగారు. వీరు తమతమ నృత్యగీతగానవినోదంబులచే ననవరత ము నన్ను వినోదింపఁజేయు రంభోర్వశీతిలోత్తమలు. నాకలో కమునుండి మా రాక. నీ రూపరేఖా విలాసంబులను గూర్చి నీ హరపాదసేవనాపరత్వమును గూర్చియు నారదునివలన విని నిన్నుఁజూడ ముచ్చటఁగల్గి వచ్చియున్నాఁడను.

మహా—ధన్యాత్మురాలను! ధన్యాత్మురాలను. దేవా! తొలిజన్మమున నేజేసికొనిన సుకృతాతిశయంబునంగాదే తన్మదర్శనభాగ్యంబు లభించినది. కృతార్థురాలను. మహాత్మా! కృతార్థురాలను ఈపవిత్రాసనంబున నలంకరింతురుగాక.

ఇంద్రు—(కూర్చుండి.)

మ. తను వీక్షించినయంతమాత్రమునఁ నే । తన్వంగి "ధన్యాత్మురా
లను నైతిన్ సుమి" యంచనన్ సరస స । ల్లాపంబులం దింపి నం
తన నెట్లుండును నాదువాంఛితము సు । తన్ బీసుపోకుండ నా
ప్పనసుమ్మా ఫలమంచుఁ జెప్పఁ దొడఁగెన్ । పూబోడిచూడ్కుల్ భళీ.

(ప్రకాశముగా) తరుణీమణీ! నీవొక్కతవే ధన్యాత్మురాలవు కాలేదు. నిన్ను వీక్షించుటచేత నేనుఁగూడ ధన్యుఁడనైతిగదా!

మహా—(తనలో) ఇతిజనాథుఁడేమి! మానవమాత్రురాలైన నన్ని ట్లనుచున్నాఁడేమి? ఏమియో నామనోపరిశీలనఁ బునరై యిటకువచ్చి నాబుద్ధిఁ దోఁచుచున్నయది. (ప్రకాశముగా) దేవా! తా మట్లనుట భావ్యమగునా? (శిరమువంచుకొనును.)

ఇంద్రు—త్రిజగన్మోహినీ! నేనాడిన పలుకులయందతిశయోక్తియేమి కలదు. చూడు.

గీ. సతి యహల్యను మించిన । చాన లేదు
అల శచీదేవినిన్ బోలు । యతివ లేద

టించు మనమున నెంతో గ । ర్వించుచుండు
నిన్గనుటతోడ గర్వంబు । నిల్గిపోయె.

అందుచే నట్లంటి. పోని భోగంపు కాంతలలో నందామా! చూచుచునే యున్నావుగదా! ఈసుందరీమణులు యాదచందములను. వీరికిని నీకును హస్తిమశకాంతరము తారతమ్య ముండుటచే నట్లంటిని. దోసమగునా! (దేవకాంతల దిక్కై) కాంతలారా! నాపల్కులయం దసత్యదోష మున్నదా!

దేవకాం—దేవా! లేదు లేదు. ఈకాంత నిజముగాఁ ద్రిజగన్మోహిని యై మమ్ములనందఱిని దిగదుడిచి వైచుచున్నది.

ఇంద్రు—చూచితివా! సుందరీ యేమనుచున్నారో! అందులకనియే!

ఉ. నారదమౌనిచంద్రువల । నన్ భవదీయచరిత్ర వీనులన్
జేరుటచేతనో తరుణి । చిత్తము తత్తఱమంది నిన్గనం
గోరి ప్రయాసమందియుట । కున్ జనుదెంచితి నిప్డు నాయనో
హారిణి వైతివిప్పు! అబ । లాదరిఁ జేర్పుము నన్ను నెట్టులేన్.

మహా—(స్వగతము.) నారదా! నానిష్కళంక ధ్యానమునకు నీకన్నులు కుట్టినవా! ఏదో యొక విచిత్రనాటక మాడించుచున్నంగాని నీకడుపు మంటతీర్చుకొనలేవు కాఁబోలు. నారూపంబున నేమంత మహాతేజస్సుగలదని నీ వీయింద్రుని ముందుఁ గోరంతలు కొండంతలుగఁ జేసి చెప్పితివి! ఈతఁడీవిధంబునఁ బలుకుచున్నాడే! వీని కింతటి దురేచ్ఛ జనించుట కేమి కతమో! ఓ పరమేశ్వరా! వీనికేవిధంబగు సమాధాన మొసంగవలయునో తోచకున్నయది. నోట నేమాటవచ్చిన నేమివాటిల్లునోగదా. సదాశివమూర్తీ! ఇమ్మహానుభావున కిట్టివెడఁగు తలంపును మాన్పి సన్మార్గశీలుని గావింతువుగాక. ఎన్నిమాయవేషంబులు దాల్చియైనను సతీశివమై వచ్చి నన్ను బరీక్షించిన నేనులొంగఁ

గల్గుదునుగాని వారి నీరి విషమ పరీక్షలకాఁగఁజాల (ఊర
కొనును.)

ఇంద్రు—కాంతామణీ! నీకుత్తరం బంగీకార సూచకంబగునే! చూడుము!

మ. కరుణాదూరత నామరుంగు తరుణీ ! కార్పణ్యమున్ బూని తా
శరముల్ గుప్పుచు నున్నవాఁడెద భరిం ! చన్ జాలకన్ నిన్ను నే
శరణంబంటిని సత్కృపామతిని గా ! చన్ జూడుమా! నీవె నా
శరణన్ జేరిన వాని కావరమడంచన్ ! జాలెదన్ ఝామములో.

మహా—మహానుభావా! పదునాల్గులోకంబుల పాలుబత్తెముగఁ గైకొను తాము నాయట్టి యధమురాలి నీవిధముగాఁ గోరుట పాడియా? సకలధర్మవేదులరగు తమకు నేనేమని విన్నవింపఁగలను నామనోపరిశీలనంబునకై యిట్లుతాడుచుండిరో! లేక నిక్కువముగా నాపైనట్టి భ్రాంతిజనించియే పలుకుచున్నారోగాని తమవంటి మహానుభావులు నాయట్టివారల నన్యోగతులనుంచి సంరక్షింపవలయును. మాకలుషంబు లడంగింపవలయును. మా నుతుల నందవలయును. అంతియేకాని లెక్కకుమీఱిన సుందరాంగులు తమచెంతనుండ.—

గీ. సర్వము శివార్పణముచేసి ! జగతితోడి
బాంధవముబీడి యీగతి ! వటువు నన్ను
రూపవతినంచు నగ్గించి ! పాపకార్య
మునకుఁ బురిగొల్పఁ బాడియే ! యనఘ మీకు.

ఇంద్రు—(స్వగతము.) నిజముగ నీకాంత నావలలోఁ బడునట్లు లేదు. ఇంతటితో విడువఁగూడదు. సాధనాంతరంబులఁ జూడవలయును. (ప్రకాశముగ) సుందరీమణీ!

గీ. పదియునారేండ్లైన నీదు ! ప్రాయమపుడె
యౌవనం బాతెయనుమట్టి ! యందగలిపి

ఇట్టువిరాగికి వాట కీ । నెట్లు సహించి
మసలుచున్నావో తెలుసు । యీనూడ్కి-నీకు.

ఆ విరించి స్వయముగా నిన్నుఁ బోతఁబోసి యీమర్త్యలోకంబున వేశ్యాంగనయుంటఁ బాలువైచినందులకు—

గీ. కోట్లకొలఁదిగ ద్రవ్యంబు । గుంజవచ్చు
మదనసామ్రాజ్య మేలుచు । మనగవచ్చు
భోగముల నెప్పుడును తుల । తూగవచ్చు
గాని యీరీతి వైరాగ్య । మూనఁదగునె.

అయినయిపుడు మిగిలిన దేమున్నది?

గీ. దివిజనాథుని కోరిక । తెలియఁబడెను.
గాన నీ యనాదరణజూపు । కలువకంటి
త్రిదివమేలించు నీచేత । దిరిగిపోను
సేవఁ జేయించు నాశచీ । దేవిశ్లోఘ.

మహా—ఆర్యా! నేను పుట్టుకచేత వేశ్యనైనను నన్ను సృష్టించిన యా విరించియే నన్నికార్యమునకుఁ బురిగొల్పి సర్వంబును యీశ్వరార్పణ మొనర్పించి నన్నాదిప్రభువను శాశ్వతభక్తురాలనుగా గావించెను. మహాత్మా అట్టి నామనం బిప్పుడన్యకోరికల నర్థించి దూషింపఁ బనిగలదా?

ఇంద్రు—ఓలావణ్యవతీ! నీతనూవిలాసవర్ణనంబు యీమహాత్మునిపుంగవునినోట విన్నదిమొదలు రాచకీయ వ్యవహారంబులపై మనసుపోక వారాంగనా నృత్యాది విశేషంబులఁ దిలకించుట కిచ్ఛజనింపక నిన్నుజూతమనేభ్రాంతిచే సమయంబులు యుగంబులుగా గడిపి యెట్టెటులో గల్పించి యింతదూరమునచ్చిన నాకోరిక రిత్తపుచ్చిపంపుట భావ్యముగాదు. శరణాగన్నవానిజంపనుంకించుట ధర్మముగాదు.

మహా—సకలధర్మస్వరూపుఁడవు. మజ్జంబులకు శాసనకర్త్వాగా కర్తవు. కామపీడితులై పరాంగనా సురత మభిలషించిన వారిని శిక్షింప వలసినవాఁడవు. నిరుపమాన మహిమాన్వితుఁడగు బృహస్పతులవారి యనుంగు శిష్యుఁడవు. సృష్టి స్థితి లయకారణ భూతుఁడగు సర్వేశ్వరుని కగ్రజుండవు. ఇట్టి నీకిట్టి తలంపు గలుగుట కేమనవలయును. అనవరతంబును భవదీయచరణ దాస్యమొనర్చుచు ధన్యరాండ్రై విలసిల్లు యాయప్సరాంగ నలు నీమనోభీష్టము నెరవేర్పఁజాలరా! అంతకన్న నేమంత మిన్నయని నన్నర్థించితిరి. ఇంతియెగాక నేనింతదనుక శృంగారవి లాసమన నేమియో నెఱుంగనుగదా! నామూలమున నదమకేమి సుఖంబు చేకూఱునని యెంచితిరి. దేవా! త్వదీయేప్సితంబు నెరవేర్చుశక్తి సామర్థ్యంబులు నాకడ లేవు. నన్నింతటితో మన్నించి విడిచిపుచ్చుఁడు. మీకు పదివేలనమస్కారములొనర్తును.

ఇంద్రు—రమణీమణీ! నీరూపము సహస్రాక్షుఁడనయ్యు నన్నేయింతభ్రమింపఁజేయఁ దక్కినవారిమాట అడుగవలయునా? మనోహారిణీ! నామనంబు నీయధీనమై తదన్యంబుపైఁ బోకున్నయది. నీధర్మోపన్యాసము నావీనులఁ జేరకున్నయది. వ్యర్థప్రసంగమును జాలించి నన్నొక్కసారి గాఢాలింగన మొనర్చి ధన్యుని జేయుమా.

గీ. త్రిదివమేలెడు ప్రభుఁడు। యీరీతి హస్త
యుగ్మమును మోడ్చి। నిన్వేడుచుండ వీని
నాదరింపక పోవుట। యబల నీకు
తగదు కరుణించి। యధరామృతమ్ము నిమ్ము.

కరయుగ్మంబులు మోడ్చి వేడుకొన్నంగాని మేనకను జేపట్టఁజేరని యని నేను, పాదంబులపైఁబడి యర్థించినఁగాని యూర్వశిని పాదసేవ

జేయసీయని నేను గద్దంబుఁబుచ్చుకొని బ్రోల్మాలినఁగాని తిలోత్తమను కరుణించని నేను, యెన్నెన్ని యుపచారములో యొనర్చి యుపలాలించినఁగాని పౌలోమిని దలయెత్తి పలుకరించని నేను, నీ పొందు గోరి నన్ను ధన్యునిఁజేతువని యెంతయో యాశపెట్టుకొని నాయంతట నేనువచ్చియర్థినై ప్రార్థించుచుండ నీ కేలకయిూ రాకా. ఓ కామినీమణీ!

గీ. అమరనాయకుఁడను నేను । నర్థినగుచు
బ్రోలుమూలంగ సిరసింప । బాళిగాను
కరుణ వచియింతువేని నీ । చరణములకు
వందనశతంబు లర్పింతు । సుందరాంగి.

(అని పాదములపైఁ బడఁబోవ)

మహా—(దూరముగాఁ జని) పాకశాసనా! మాయట్టి యతనములు పాపకార్యాన్వితులై యుండుటఁజూచి జాలిఁగొని వీరల సదాచారసంపన్నులఁజేసి రక్షించవలసిన తామే యిట్టి బెట్టివంపు కార్యంబుల కొడిగట్ట నింకఁ బ్రోవఁజచుచున్నదే? దేవా!

గీ. అర్థితుల కోర్కెలను నప్పు । డపుడె తీర్చు
కల్పతరువును మఱి కామ । గవియుగల్గి
ముజ్జగంబులఁ బ్రోచెడు । పోషవగుచు
స్వీయగౌరవ మీరీతి । జెఱచెదేల.

గీ. హరిహరాదుల మన్నన । లందియుండు
నుతుల నందిచరించు న । ద్గతిఁబోలంగ
వేశ్యనగు నన్నుఁ గామించి । వేడవగు నె
పాదములమీద వ్రాలఁ రాఁ । బాడి యగునె.

ఇప్పటికే మా భారతావని దురాచారభూయిష్టమై యధోగతి పాలయి యుండ మీయట్టి జగద్భద్రసాధాయకులుగూడ నిట్టి యకార్యముల కుపక్రమింప నింకఁజెప్పఁదగిన దేమున్నది.

ఇంద్రు—వేశ్యలలోఁ బుట్టి నీ కింతటి వాగ్వాదమెందులకు! సిరి రా మోకాలడ్డు మూర్ఖురాండ్రు గణికలలోఁ గలరా!

మహా—సత్పథగాములకుఁ గులముతోఁ బనేముండును. దేవా! గుణము ప్రధానమగుటం జేసియు, వ్యభిచార మన్నివిధంబుల దోషపూరితమైనదని నా యంతరాత్మ ప్రబోధించుటం జేసియు, మీ కీ కార్యంబు పొత్తుగాఁ దగదని విన్నవించుకొంటిని. మహానుభావా! వే పలుకులేల?

గీ. స్థిరతరానందమున సదా । శివుభజించి
భవాని సేవలొనర్చుటే । గాని నితర
తుచ్ఛసుఖముల గోరుటం । దు నమనంబుఁ
జొరపు బొరదయ్యు దేవేంద్ర । పొరపు పొరపు.

ఇంద్రు—నాకలోకంబున నీవు పొందఁగల మహాసుఖంబుల గుర్తెఱుంగ లేక యిట్టుల వెఱ్ఱిమాటలాడుచుంటివిగాని ఎఱింగియున్నచో నిట్టులనవు. చూడు. ఆ సుందరనందనోద్యానవనంబున మనమిరువురమును విహరించుచు, విలాసంబుగఁ బుచ్చునపు డానందము ఎప్పటికప్పుడు నవయౌవనోత్సాహ మొసంగుచుండు పారిజాత పుష్పంబుల నీ ధమ్మిల్లమున నలంకరించుకొనునపుడు గలుగుచుండెడి పారవశ్యము, ఈ కాంతామణులతో నృత్యగానాది విశేషంబు లాలించుచు హంసతూలికాతల్పంబుపైఁ బరుండి పొందుచుండెడి సంతోషము, ఇంతటిప్రభువునైన నన్నుఁ జేపట్టిన పట్టపురాణియగు పులోమిజ సీతోడగూడి వినోదంబుగఁ గాలంబుఁ బుచ్చుచున్నపుడు నీవు పొందగలిగెడి ముదంబు వర్ణింప నలవి యగునా? ఇంతియేల? ఈ దేవేంద్రుడు యీ పాకశాసనుఁడు యీ బలారి నీ సేవకుండై వింజామరఁ జేత ధరించి విసరుచు నీకరుణాకటాక్షవీక్షణమునకై నిరీక్షిం

చుచున్నప్పుడు నో త్రిజగన్మోహన తలయెత్తి నావంకఁ జూడుము. చూడవా? చూడఁజాలవా? నన్నుఁజూచుటకు నీ మనం బంగీకరింపకున్నయదా? లేక నీ తనూవైభవ బుడు వేయికన్నుల వీక్షించు మాకుటచే దృష్టిదోషము నాకొల్లునని చూపకుంటివా? చూడుము. నా మాటవినుము. నా విన్నపము సార్థకపరుపుము. నేను పడినశ్రమ యాలోచించియైనను జాలి దలంపుము. ముజ్జగంబులకు దొరనైన నేనే నీ దాసుఁడనై సదా నీ యాజ్ఞానువర్తినై మెలంగఁ ద్రికరణశుద్ధిగా నిచ్చగించు చున్నప్పుడు నీ వెంతటి సౌఖ్యంబుల నోలలాడెదవో నేను వేఱుగఁజెప్ప నేల?

మహా—(కోపమునంజూచి మఱల తల వంచుకొనును)

ఇంద్ర—సుందరీ! అంతకోపం బేమిటికి? నా వాక్యము లతిశయోక్తులుగాఁ బరిణమించుచున్నవా! నీవు నిక్కముగాఁ గ్రోధపూరితవైతివేని నాఁగఁజాలను. నీ తనుసంస్పర్శన మహాభాగ్యమున గాని నిలువఁజాల. నీ యధరామృతాస్వాదనంబునఁగాని బ్రతుకఁజాల. నీ రతిసుఖంబొసంగినఁగాని మనఁగఁజాల. నీ సేవకాగణము చాలకనా? నా రూపరేఖావిలాసంబులు నీ నేత్రములకానందముఁగలిగింపకనా? నా విజ్ఞాపనము నీ వీనులకు ములుకులవలె నాటుచున్నవియా! నీ యాగ్రహమున కేదియో కారణముండవలయునుగదా! వలదు ఆగ్రహము వలదు. వినుము. నీ కరుణాకటాక్షవీక్షణమున కీ దాసుఁడు నిరీక్షించునపుడు నీవు నీ ప్రణయకోపంబును చూపుచు నన్ను కోరికెలర్థించునపుడు నాచే మన్ననలంది బహువిధంబుల రతులఁదేలునపుడు నీకు గలిగెడి ప్రమోదమున కంతుండదు. స్వర్గసుఖజలధి నోలలాడుటకే లెక్కలేనిమానవులు పరితపించుచు నెంతెం

తేయో కష్టము లుండునుడ స్వర్గాధిపతి తానయ్యైవచ్చి యర్థించుచుండ గాల దన్నుకొనుచుఁ గైలాసవాసుని భజించుచు నాతని దాస్యమును గోరుకొందు నేల? స్వర్గసౌఖ్యంబులకన్నఁ గైలాసంబున నేమి యెక్కువగ బాప్రకొందువు మదవతీ!

గీ. తినుట కన్నంబునుఁ గట్టు । కొనఁగగుడ్డ
నుండ నీడయు లేక నే । దో విధాన
బుఱ్ఱెఁ జేకొంచు భిక్షుండై । పొట్టపోసి
కొనెడి శివుఁడేడ? నిన్నేలు । కొనుటయేడ?

గీ. ఆలులనె తిన్నగాఁజూచి । యేలుకొనఁగ
శక్తి లేకుంటచే నగ । బాట్లుబడుచు!
నెత్తియాదు వక్షమునందు । నిల్పుకొనుచు!
దిరుగుచున్న శివుఁడెట్లు । గరుణఁజూపు.

మహా:— మీ వాక్యంబులు కర్ణకఠోరములుగావా? ఆ శంకరుని మీయట్టి దివ్యపురుషు లీవిధంబుగ నిరసించుట దోసముగాదా! ఆతఁడాపదుద్ధారకుఁడని ఆశ్రితావనరక్షకుఁడని మీకెన్నఁడును స్వానుభవంబునఁ దెలియలేదా? దీనావనుండగు శ్రీమన్నారాయణమూర్తియేని యా సదాశివుని మహామహిమలఁ దెలుపలేదా! మీ శ్రేయోభిలాషయై మీ తోడునీడగఁ జరించు నాచార్యోత్తముఁడు బృహస్పతులవారైనఁ జెప్పియుండరా! నా రూపంబునుగూర్చి యేమేమో వక్కాణించి మిమ్మింతదూరము రాఁ బరియాసపెట్టిన యా కలహాభోక్త నారదుండేని యెఱింగింపలేదా! మహాపతివ్రతాశిరోమణియైన పౌలోమియైన విన్నవించుకొనలేదా! మీయట్టి వారి చరణాబ్జంబులఁ గొల్చుచు నిరంతరానందమనుభవించు నాయట్టివారు తమకు ధర్మోపదేశ మొనర్ప సమర్థులా! అమరవల్లభా! పునరుక్తిదోషంబు బాటింప

లేని యిట్టికోరికే తమకుఁ గూడదని మఱల విన్నవించుకొందును. దివిజనాయకా! ఎంతటి వేశ్యనైననుతమపై నాకనురాగము చేకూ ఱనపుడు నాకీసుఖములతో సర్వసరమేమి? నాకు పరిచర్య లతోఁబనేల? స్వర్గవాసంబుతో నివృత్తమేల? మహాత్మా! దాసు రాలి నిరాదరణమునకు మన్నింతురుగాక. మానస్కంబున నిట్టి భక్తియే కుదురుటకల్ల. ఏమో ఆ యీశ్వరానుగ్రహంబునఁ గలి గినదానికి మీరుసంతసించి నా కింతమోక్షపదవిని జూపి అను గ్రహించవలయునుగాని దానికి భిన్నమూ మీరుచేయవలసినది. పాకశాసనా! నిజము మనవిఁజేసెదను. నిరంతర పరకాంతా సురత మభిలషించు మీయట్టి ప్రభుసామీప్యంబున నాకలోక మున నుండుటకన్న ఏవిధమగుసుఖము లేకున్నను నా కైలాస వాసుని యనుగ్రహమునే గోరుచు వాని గిరియే వాసముగాఁ జేసుకొందును. ఆ గంగాధరుని చరణదాస్యమునే యర్థించుచు వానికే దాస్యమొనర్చుచుందును.

గీ. కష్టము లవెన్నివచ్చిన । గడువఁగలను
ప్రాణహానివాటిల్లినఁ । బరితపింప
మాన భంగముఁగల్గిన । మనగఁగలను
గాని నీ దాస్యమునుగోరు । దాసఁగాను.

ఇంద్రు—నా మాటవినఁజాలవా! నారదునితో నేనాడినవాక్యంబులు రిత్తకావలసినదేనా?

మహా—తమకోర్కెలు రిత్తయగుట నూతనమా! పురాణ ప్రసిద్ధ ములుగావా?

గీ. సతి యహల్యను మానించి । చాలకనులు
గలిగి వర్తిల్లునది మీర । గాదె తులసి

వలనఁ జీవాట్లు చెందిన । వాయుగారె
తమరు తమచరిత్రంబు నూ । తనమెరూకు.

ఇకఁ దమబాహుబలసంపన్నతను గూర్చియందమా!

సీ. గౌతమ మునిచాగ్రి । కాళ్ళపైబడి శాప
రక్షణ కోరిన । క్రిమహాసాక్షి
వలదన్న వినక నా । తులసీ సతిని వేడ
పరిభవించిన జలం । ధరుడెసాక్షి
ఆల మందలరీతి । దోలినాకము నేలి
గోలజేసిన నర । కుండెసాక్షి
ఎదిరెంచి యదలించి । యెన్నో గతుల మమ్ము
స్రుక్కించి నట్టి । కంసుండె సాక్షి.
రక్కసులు రేగినపుడెల్ల । దిక్కులేమి
శరణమిచ్చి రక్షించిన । హరియెసాక్షి
గానఁ జెప్పంగఁ బనిలేదు । కరుణగలిగి
పూనినట్టి తలపును నిక । మానుఁడయ్య.

ఇంద్రు—లేనిపోని వృథా ప్రసంగంబులోనికిఁ దిగుచున్న దానవు. నిన్నీ తరుణంబున బలవంతముగ విమానంబునఁ బట్టవైచుకొని పోయిన చో నిన్నా శంకరుఁడే గాచునో! విష్ణుఁడే శరణ్యుఁడగునో? నాబాహుబల సంపద లెంతగలవో నీకుఁ జక్కఁగా బోధపడఁగలవుసుమా!

మహా—మీరట్టి కట్టడి కార్యంబున కొడిగట్టుకొని నంతమాత్రంబుననే తమకోరిక సఫలమైనట్టుల సంతసింతురు గాబోలు. వలదన్న వినక బలవంతముగఁ జెరఁబట్టు కాంతల యుసురు లిప్పటికిఁ గాకున్నను నెప్పటికైనను దగులక విడునా? దోషులను దండింప దైవారుండరా?

ఇంద్రు—ఓకాంతా! నీ వాగ్ధోరణి మేరమీఱుచున్నయది. అనవసరం బుగఁ గాలంబును బాడుసేయక నామనోభీష్టమీడేర్పుము. నిలువఁ జాలకుంటిని.

(అనికౌఁగలింపఁబోవ)

మహా—(వెనుకకుఁబోయి) (తనలో) ఓదయామయా! పరాత్పరా!

చ. వలదని యెంతజెప్పిన స్వ । భావము చూనకనీ బలా రి నన్
వలచి స్పృశింప వచ్చెడిని । వారణఁ జేయుము ... దా
తలఁపును దాసురాలికి వ్య । థన్ గలి... మయ్య ! నీమఖా
జల నొనరించు వారలకొ । సంగెదె క...ముల్ సదా...

ఉ. ఒంటరిదాననై యిచట । నుంటినటంచుఁ దలంచి స్వామివై
న్వ్యాటనె సంచరించు చతి । భీతినిసంగుచు ... ...
గొంటకుఁజూడ సాగె నిది । గూడదటంచు హితంబు చెప్పయీ
తుంటరి కార్యమున్ విడచి । తోవినె పోవఁగఁ జేయుమా శివా.

గీ. పరిభవ విధానమున్ జూచి । భర్తృరాలి
మానభంగంబు గాకుండ । మనుపుమయ్య
జాగు జేసిన దుష్కృతి । కాగలేను
కరుణఁ జూపింప శంకరా । తరుణమిదియె.

(ప్రకాశముగా) ఓ పాకశాసనా! ఒంటరిదాననై యిచట నుంటిననియు మీ యిచ్ఛ నెరవేరుననియుఁ దలంచు చుండిరేమో! అట్లనుకొనవలదు. నిర్మల చిత్తంబున నింత కాలమునుండి భజించుచుండిన నన్నా సదాశివమూర్తి ఆదరింపకపోఁడు. ఆశ్రితావన దీక్షాపరతంత్రుఁడగు నా విష్ణుదేవుఁడసైన ననుగ్రహింపక విడువఁబోఁడు.

ఇంద్రు—ఓసీ! భోగముదానవైన నీవు నాకు శిరోభాగ దేశముఁ జేయుచు నాకోరికెఁ దిరస్కరించుచు మీకు మిక్కిలి నెవ్వరో యేమో

యొసర్చువారలను చెప్పుచుంటివా! ఏదీ! ఏవీరుండు నిన్నుద్ధరింపఁ గలఁడో చూచెదఁగాక. (అని బల్మిని గైకొన నుంకింప)

మహా—ఇంద్రా! నీకుఁ దగదు. నీకుఁదగదు. నామానసంబునకు వ్యథ గల్గించుట నీకుఁ దగదు. దగ్గఱకు రాకుము. నాచిత్తంబేపాప కార్యంబునకును మున్నెన్నఁడును పాల్పడనిదిసుమా! చెడి యెదవు. అమునాయకుఁడవనియు, నారాయణుని సోదరుఁడవనియు నెంతయో గౌరవముగ సంభాషించుచుంటిని. ఇఁక నీ మొగమాటము నాకెంత మాత్రము లేదుసుమా! నిర్మలచిత్తనగు నా! నోటివెంటఁ బరుష వాక్యంబులు దొరలె నేని పిదప పశ్చాత్తాప పడుదువు. నాయుసురు వృథాపోదు. నన్నంటుకొను దోషంబునకుఁ దగిన ఫల మనుభవింతువు. నీత్రోవ నిప్పటికైనఁ బొమ్ము.

ఇంద్రు—ఓ కాంతలారా! ఇంకను చూచెదరేమి! కండకావరమున బ్రేలు యీ దురాత్మురాలి ఱెక్కలను గట్టి విమానమునందుఁ జేర్చుఁడు. పదఁపడి చూచుకొందము.

దేవ—(అట్లు చేయనుంకింతురు.)

మహా—ఓ కాంతలారా! మీ రీదురాగతంబునఁ బాల్గొందురేని వానితోఁ బాటు మీరును చెడిపోదురు. పరపురుషుం డెవ్వఁడేని యిట్టి పరాభవము మీకే యొనర్పఁ బూనినపుడు మీ కేగతి వ్యథ నొందుదురో అట్టిదియే యీ పరిభవమని గూడదలంపుఁడు. ఓ యింద్రా! సిగ్గుమాలిన కార్యంబున కేల యుపక్రమించెదవు? ఆకసమున నీ వొనర్చుచున్న చెయ్దముల నాశివుఁడు పరీక్షించుచున్నాఁడు. దోషమును నిర్ధరించుచున్నాఁడు. ఆగ్రహమును దాల్చుచున్నాఁడు. విడువుము. నీ తలంపువిడువుము.

శివు—పోనిమ్ము. నారదా! గణిక గదా! అంతటి సామ్రాజ్యాధిపతి వచ్చి యర్థింప వ్యర్థపుచ్చి పంపఁదగునా!

నార—చిత్త మంగీకరింపనపు డేమి చేయఁగలదు? నిష్కపటముగు భక్తి గలిగి ప్రపంచకంబును బహిష్కరించుకొని ముముక్షుమార్గం బార్జింప యత్నించు నాకాంత నీవిధంబుగ నర్థించుట వీనికి మాత్రము దగునా! కన్నుగానక వర్తించినందులకు నాబిడ యొనర్చిన గర్వభంగము దూష్యమైనదా! చంద్రశేఖరా! నే నే మందునో యని తామటుల సెలవిచ్చుటయే గాని మీ కెఱుఁగ రాని యంశ మేమిగలదు?

శివు—పాప మింద్రుఁడు కడుబాధ ననుభవించుచున్నాఁడుగదా! ఆతనికి యథాపూర్వంబిచ్చి కరుణించిన బాగుండు నేమో?

నార—ఇప్పు డేమి తొందర. దీని కేమిగాని—సదాశివా!

గీ. అమలభక్తిఁ జరించెడు । నట్టివారిఁ
దగు పరీక్షలొనర్చియ । దార్థములను
జాటి వారికి మోక్షంబొ । సంగుటలు వి
ధాయకంబగు గద చంద్ర । ధరుఁడ నీకు.

శివు—నేను పరీక్షఁ జేసి దర్శన మొసంగఁదగినంత భక్తురాలా! నారదా!

నార—నేను చెప్ప నేల? నీ చిత్తరువొకటి ప్రతిష్ఠించి దానికొక మందిర మేర్పరచి అనుదినంబును పూజఁ జేయుచు నీ పాదంబుల భజించుకొనుచు దన కోమలకంఠముచే గానముఁ జేయుచు నానందపరవశురాలై నృత్యము జేయుఁచు వచ్చిపోయెడి సాధువుల సన్మానించుచు నామె కలుఁగఁజేయు ఆనందము గంగాధరా! వర్ణించి చెప్పుటకు నాకు నోరొకటిచాలదుసుమా! అచట నీ విగ్రహము నలంకరించిన విధానము వేయినేత్రముల తోడి

చూచిన మహేంద్రునికే తనివితీఱవపుడు రెండుకన్నులతోఁ జూచివచ్చిన నే నేమనిచెప్పను. మఱియు నొకగొప్పవిశేషము.

సీ. కురులునున్నగ దువ్వి । యొఱుఁగని లలితాంగి
కాటుకెట్టిదొయెఱుఁ । గని సుశీల
జిలుఁగువల్వలను దా । ల్చిన పాపమునఁబోవు
దములంబు వేయు దా । తలిరుబోఁడి
అన్యపురుసంగఁబు । నతివ చేసియెఱుంగ
దాయింతి ధనమున । కాశపడను
భోగముల్ పొందుటా । ముగుదకుఁ జీకాకు
పొద్దువృథాపుచ్చు । పోని బడతి.
కావిగుడ్డ ధరియించు । కాలమంత
చంద్రశేఖర ! నిన్నుఁబూ । జలనొనర్చు
టందు గడుపుచు దేవళ । మందెనుండు
గృహమునకుఁ బోయియెఱుఁ గదా । కీరవాణి.
గీ. అచలకన్యామనోధవా । అట్టిదశను
నున్న నున్ జెక్కుచెదరదా । యన్నుమిన్న
ఆమెనున్ గన్న షుపున । కైనఁగాని
భ్రమజనింపక యుండుట । వట్టిమాట.

శివు—నారదా ! నేఁపుడు పరీక్షింపవలసినది ఆమె రూపమునా ? భక్తినా?

నార—షుట నాఘుటన సమర్థులెటులఁ బరీక్షించిన నేమిలోపముండును.

శివు—ముఖ్యముగా నేనటకుఁబోయిరావలయుననియే నీయభిమతమా.

నార—దేవా ! వేఱయడుగనేల? ఆపె దిగంత విశ్రాంతకీర్తిని భారత లోకంబునకుఁ జాటుటకుఁ దగుమార్గంబు లన్వేషించు టావశ్యకముగదా! మీాప్రభుత్వము వచ్చినపిమ్మట నీవేశ్యకులంబున

నిట్టి యుత్తమచారిత్రి నిట్టి భక్తురాలు నిట్టిసురూప సంపద యిట్టి విరాగిణి యిట్టి స్వార్థత్యాగి యిట్టి శాంతస్వరూపిణి జనించినయుల నీవెఱుగుదువా ? అదృష్టవశంబున మన కట్టిదశ పట్టినపుడే మనము శ్రద్ధవహించనిచో నీభారతఖండం బిట్టులనే యధోగతిలో నుండవలసినదేనా ? కులకాంతలెందఱో తమ తమ భర్తల ముఖములకు మొగమువాచి గోల పెట్టుచుండ మనము మౌనముద్ర వహించుచుండవలసినదేనా ? కర్మక్షేత్రమని పేరుబడసి శ్రుతి స్మృత్యుత్పత్తికి స్థానమై యొప్పు మొన్నటివఱకు ధర్మము నాలుగు పాదములమీఁద నడచిన భూమియై సకలదేశములకు శిరోమణియై సిరుల కావాసమై సంపదలకు నిలయమై చతుర్వేదములకు స్థావరంబై యొప్పెడు నీభారతభూమి యెంతకాల మీ యున్మత్తజాతితో నెంతకాల మీ వేఱుపురుషులతో నెంతకాల మీయపవిత్రులతో నడగారి పోవలయును ? చంద్రశేఖరా? అనుదినం బా భారత జననియాక్రందన మొనర్చుచుండ మన వీనులకు వినవచ్చుచుండుట లేదా ? పరమ పవిత్రయగు నాసుశీల యీకులటలతో త్రాగుబోతులతో మాతృవంచకులతో ఆత్మలాభపరాయణులతో అసూయావేశులతో ఐకమత్యాభిమాన విదూరులతో అసత్యాలాపులతో మతద్వేషులతో జీవహింసాభిలాషులతో నిర్దాక్షిణ్యులతో దానధర్మశూన్యులతో పొగరుబోతులతో వినయవిహీనులతో స్వభాషానిరసులతో వేగలేక ననవరత మల్లాడుచుండ నయ్యో ! సుతయేని మీకుఁ గరుణ కలుగకున్న నెట్లు ? ఎన్నటికి భారతదేశమునకు విముక్తి ? నీ భక్తులు మాతృసేవా పరాయణులు. సూనృత పథగాములు. అనవరత దేశక్షేమాభిలాషులు. పురోభివృద్ధికై

స్వార్థత్యాగులై కష్టనిష్ఠురముల కోర్చి యెన్నియో శ్రమల నందుచుండ వారియెడల మన కనికరము జూపుట విధాయకము గాదా? మును పితులనేయూరకుండిరా? దుష్టశిక్షణ శిష్టరక్షణ పరాయణులన్న బిరుదంబును, ఆర్తావన దీక్షాపరతంత్రులన్న ఖ్యాతిని లోకోద్ధారక పురుషులన్న గౌరవంబునుమాపుకొనవలె ననెడి తాత్పర్యమా ! ఎందఱిని పరీక్షించిరి ? భక్తుల నెందరిని రక్షించిరి. ఎందఱి దుష్టుల నిగ్రహించిరి. ఎన్నెన్ని ధర్మముల లోకములఁ జాటిరి. అట్టి మీ పరిశ్రమలు నేఁడేమగుచున్నవి. ఈవఱలోఁ బడిన శ్రమంబున కిపుడు విశ్రాంతిఁ గైకొనుచుండిరా ? విశ్రాంతి కింతకాలమని నియమములేదా ? అంతయు ముంచుకొని పోకముందు మీరు లేచుట ధర్మము. ఇట్టి మానవతులఁ బరిశోధించి వారి యశస్సును జాటి లోకంబునకు గుణపాఠముల నేర్పుఁడు. నిద్రింబోకుఁడు! దేవా! జాగుచేయకుఁడు ఈనారదుఁ డేదియో దీర్ఘముగ వాగుచుండెనని నిరాదరణ జేయకుము. కఠినశాసనమరు నీఫాలనేత్రమును విప్పి చూడకుము. నేను నీకు బాధఁ గల్గించు మన్మథుఁడను గాను. లోకోద్ధారణ మొనర్పుఁడని యర్థింప వచ్చిన మీభక్తుఁడను.

శివు—నారదా ! చాలును. నాకింతగాఁ జెప్పవలయునా ? ఆమె నిరంతరభక్తిని నేను గ్రహించుచున్నాఁడను. ఆమెను గటాక్షింప నిశ్చయించితి. ప్రపంచంబున నేమానవునినైనఁ బరిశోధించ వలయునన ననేక చిత్రవిచిత్ర పాత్రంబులఁ గల్పించి యొకవిధమగు నాటకమాడించినఁ గాని వారిదృఢభక్తి వెల్లడికానే అదు. ఎంతటి నిష్కల్మష చిత్తంబున మనల నారాధించినను వెంటనే వారివాంఛితంబుల నీడేర్చినఁ బిదప గర్వోన్మత్తులయి తుదకు ఫలవిభ్రాంతు లయ్యెదరు. అడిగిన తోడనే వరంబు

లీయ మదాంధులయి వర్తించి యనేక దుష్కృత్యంబులొనర్చి లోకకంటకులని యనిపించుకొన్నవారి నాదరిని చూడలేదు. "అల్పసంతోషివి. అడుగుటయే తడవుగ గామితార్థంబుల నొసంగి యనేకచిక్కులం దెచ్చుచుందు" వని" ఎన్నిసారులీ దేవతాలోకము నాపై విసుగుకొనలేదు? నేనేల యట్టులం జరింపవలెను? భక్తులనైనను గఠినపరీక్ష యొనర్చినం గాని వారికీర్తి విరాజిల్లదు. సుఖములను మరిగించినవారు మనవంకం దేరపారి చూడరు. కష్టముల సహింపంచినంగాని వారికి మనపై దృఢవిశ్వాసము కుదురుటబడదు. పాపఫలమైనను బరిపక్వదశకు వచ్చినపుడుగాని రాలదు. మన విధాయక కృత్యములయందు మనమెన్నఁడు నేమఱియుండు వారము కాము. కావున నారదా! నన్ను విస్తారంబుగం బ్రోత్సహింపనేల? నేను మహానందను జూడం బోయెదను. నాశక్తి సామర్థ్యముల వినియోగించి యాబిడను బరీక్షించి యామెనిశ్చల మనంబును గ్రహించి లోకంబునకు నీతి వెదజల్లెదను. ఇది నిశ్చయము.

నార—అట్లయిన నాకిఁక సెలవా?

శివు—మంచిది. పోయిరమ్ము. నేను గూడ నా కాలోచిత కృత్యములం దీర్చుకొనియెదను.

(ఇరువురును నిష్క్రమింతురు.)

ద్వి తీ య ర ం గ ము

[వేశ్యమాతయు, శంకరయ్యయు, ప్రవేశము.]

శం—(ఇంటినలుదెసలం జూచుచు) ఇదియంతయు నీస్వార్జితమేనా?

మాత—అవును.

శంక—ఎంత సుందరభవనము?

ఉ. గాలి నొసంగు పూబొదలఁ । గ్రమ్మఁగఁ జేసిరి నాల్గువంకలన్
గాడ్పులు మన్నుగానటుల । గప్పిరి కెందనుచల్వరాళ్లు భో
గాలకుఁ బుట్టినిల్లటుల । గా నెటుఁజూచినగాని నిల్వుట
ద్దాలను బట్టుపాన్పుల ము । దంబు నొసంగెడి బొమ్మలన్ సదా
కాలము హాయిగాఁ గడుప । గాదగు చిత్రము లిందమర్చిరిం
కేలకొ నాకలోకపు సు । ఖేచ్ఛల గోరుట యిద్దిచాలదే

మాత—ఎంతచక్కఁగ నమర్చిన నేమిలాభము? అనుభవించెడి సౌగ్యత లుండవలదా!

శంక—చిన్నతనముగాన వినకుండవచ్చును. ఏనాటికేనియు ననుభవించకుండనా!

మాత—అయ్యో! ఎందఱలకుఁ జెప్పెదరు. నాలుగేండ్లనుండి చెప్పి చెప్పి ప్రాణముపిసికి యూరకుంటిని. అప్పు డేమూలఁ జూచితిరి! అదుగో! అటుచూడుఁడు.

గీ. నృత్యగీతాదివిద్యల । నేర్చుకొనఁగ
వేఱుగా నొక్కగది సమ । కూర్చియుంచు
వలయువాటి కొటాచు వం । దల కొలాది
సొమ్ము వెచ్చించితనె మ ల । క్ష్యమున్న లేదు.

సీ. అభినయ శాస్త్రంబు । లన్నియు సమకూర్చి
యుంచితి తా నభ్య । సించుననుచు
నవరత్నమయభూష । ణము లెన్నొ సమకూర్చి
దాచితి మురువుగా । దాల్చుననుచు
వెలఁగలజిల్గు వ । ల్వల నెన్నొ కొనిదాచి
యుంచితిఁ దాను ధ । రించుననుచు
చెలులతో నాడఁ బ । చ్చీసుపాళీలఁ జె
క్కించితి తా సంత । సించుననుచు.

అనుభవించదు తానొక్క । కైననిందు
చెప్పిచెప్పి వేసరి యేమి । చేయలేక
నోరుమూసుక నీవిధి । నూరకుంటి
మెన్నఁడో వినునంచు వ । చింతు రేల?

ఆయ్యా! నిజముగా నాకీయూరనున్న పాపకిమునకు నాకూతురే నామాటవిన్న యింతకు రెండింతలాస్తి గడించుకుందువా! నాకాలములో నాకీయాడువచ్చు వరకు నలుబదివేల రూపాయలాస్తిని చులకనగా నార్జించితిని.

శంక—అబ్బా! నరహరీ! నీమాటవినలేదని నిరసనగా యూరకొనకు. పదేపదే యుపదేసించవలెను. కసరవలెను. తిట్టవలయును. కొట్టవలయును. విసిపించవలయును.

మాత—పిల్లలో పిల్లలోయని కల్వరించినందులకు దేవుండనుగ్రహించి యీనలుసు నిచ్చినందులకుఁ గసర లేక కొట్ట లేకమానుకొన్నానండి—ఇదంతయు నెందులకండి? మీయదృష్టము బాగున్నది గనుక నే మిమ్ములను మూడుదినంబు లతిథులుగా నుండుమని యర్థించినది. లేకున్నచో మగపురుషు నేమి? ఇచ్చటింత కాల ముండనిచ్చు టేమి?

శంక—నిజముగా నాయదృష్టమే. నేను పిరుటంగూడ నట్టులనే యున్నది. ఏమో నన్నుఁ జూడఁగనే కూర్చుండఁజేసి దండము పెట్టి కుశలప్రశ్నంబులడిగి కులగోత్రములఁ దెలిసికొని కొంత తడవు హరిచర్యఁజేసి యీశ్వర ప్రసాదమిచ్చి నేను మెట్లో వుండఁజాలనన బలవంతపెట్టి యీ యీశ్వరుమీద నొట్టుపెట్టి నిల్పినది. కాని నామనంబునఁ బుట్టిన కోర్కె నాకాంతతో నోరువిప్పి చెప్పజాలక పోతిని. ఈహారముచు గైకొని యేమేని సాయ మొనర్చిన నీమేలు మఱవఁ వాఁడనుగాను.

మాత—ఆ యోగ్యతయేయున్న నాకేమిఁకొదువ. నిజముగా నాకాలములో సంపాదించుకొన్న దంతయు జాగ్రత్తగా దాచుకొనఁబట్టి సుఖముగా బ్రతుకుచున్నాను గాని లేకున్న యీకూతునే నమ్ముకొన్న నేనే మనుగనా! పైగానానోటమాట రానిచ్చునా నాయనా!

గీ. మొగము చిట్లించుకొనును యే । మొగము బెట్టు
కొని వచెంచెదు చెప్ప వ । ద్దనిననీకు!
బుద్ధిలేదా యనుచుఁ దిట్టి । పోయుచుండు!
నయ్య! యేమి యొనర్తు గ । య్యాళితోడ!!

పదివేలు వెచ్చించి ఆదేవాలయమే కట్టించినపుడు నోరెత్తుటకు వీలు లేకపోయినది. ఇఁక యిప్పుడు మాట్లాడనిచ్చునా!

శంక—కష్టేఫలే అన్నారుగదా! ప్రయత్నముఁ జేసినపిమ్మటఁ గాకున్న నా ప్రారబ్ధ మనుకొని యూరకొందును. ఇదివఱకు తిన్న చీవాట్లతోపాటు నామూలమున నాలుగు తిన్న నింతలో నేమినష్టము.

మాత—నేను చెప్పలేదనుకొనుట యెందులకు. ఇంతటిహారము నాకు బహుమానముగ లభియించుచుండ నాకేమి విషమా? మాట దక్కునా దక్కదాయన్న భయమేకాని మీయెదుటనే చెప్పి చూచెదను. పిదప మీ ప్రాప్తము. నాకష్టము తప్పదుగదా!

శంక—కార్యము నెరవేరినను లేకున్నను హారమును మఱల నడుగను లెమ్ము.

మాత—వేశ్యచేతిలోఁ బెట్టినవస్తువును మఱల నంటుటకు మీరేమి సరసులుగారా!

శంక—నరహరీ! మంచిగాలి వీచుచున్నదిసుమా!

గీ. ఊళ్ళ వెంబడి తిరుగుట । నొందినట్టి
శ్రమము వాయదొడంగెను । స్వర్గసుఖము
మించియున్నది నీవు ని । ద్రించినట్టి
సుందిరమునందు గూర్చుండి । పొందుహాయి.

దీనికిదోడుగా నరహరీ! చెప్పనా సిగ్గగుచున్నది సుమా! నీ కుమార్తె నాతోఁ గూడియున్నచో- ఊ—

మాత—ఎంత గడుసువారండీ! ఆ అమ్మాయి యంగీకరించడమా! మీరు సుఖించడమా! ఏమో! నాకు నమ్మకం కలుగుట లేదు.

శంక—కలుగునా! కలుగదాయని గాదు. కలిగినచో అట్టిభాగ్యము నాయానంద మడగనా! యని యనుచుంటిని

మాత—నిజమే! ఇన్నిమంచము లున్నందులకు యిన్ని పరుపు లున్నందులకు యిన్ని తూగుటుయ్యాల లున్నందులకు యింత సుఖము అనుభవించరాదండీ! నేను చచ్చినా డివియన్నియుఁ గట్టుకొని పోదునా! చెప్పండి! ఇంతకష్టమును దానికొ ఱకే గదా!

గీ. నడుము లేకున్న సత్తువ । లుడిగియున్నఁ
గట్టుసాయంబు గొనుచుబ్రి । క్కలనుదులిపి
చెదలు లేకుండ నెటులొ ర । క్షించుకొనుచు
భద్రపరచితి నిందాక । పాటుపడుచు.

(తెలంగాణా)

శ్లో. ఏకో వారిజ బాంధవః క్షితినభో వ్యాప్తుం తమోమండలం।
భిత్వాలోచన గోచరోపి భవతిత్వం కోటిసూర్యప్రభః ।
వేద్యః కిం నభవస్యహో ఘనతరం వేదృక్ష వేన్మత్తమః ।
తత్సర్వం వ్యపనీయమే పశుపతే సాక్షాత్ప్రసన్నోభవ ॥

మాత—అయ్యా! మీరున్నారను తలంపుచే యీనాడు చాల పెందలకడ వచ్చుచున్నది.

శంక—(తనలో) ఈ కాంతామణి కహిర్నిశలును నాధ్యానమేయని నారదముండు వచించిన దంతయు నిక్కువంబు. నా వేష మితరులు గ్రహించ కుండునటులను మహానందకు మాత్రమే కొన్ని చిహ్నములు గాన్పించులాగునను చక్కఁగా ధరించితిని. (అద్దములోఁ జూచుకొనుచు) భయములేదు. బాగుగనే యుంటిని. (ప్రకాశముగా) నరహరీ! నామాట జాగ్రత్తగా దాచితివా!

మాత—ఎంతభయస్థులండి! మీ ముత్యాలు రత్నాలు వజ్రాలు కెంపులు ఎవరికిని అక్కఱలేదుసుమండీ! తెచ్చియిత్తును మీ వద్దనే యుంచుకొనండీ!

శంక—ఎంతమాట మీరు హరింతురనికాదు. బయట నెచ్చటనైన మరచితివేమో! ఎవరికిని గాకుండఁ బరులుహరింతురని యట్లంటిని.

(తెరలో)

శ్లో. బుద్ధి స్థిరాధపితు మీశ్వర పాదపద్మ।
సక్తావధూర్వి రహిణీవసదా స్మరంతీ।
సద్భావ నాస్మరణ దర్శనకీర్తనాది।
సమ్మోహితైవ శివమంత్రజపే నవింతే॥

శంక—నరహరీ! ఏమీకంఠమాధుర్యము. శ్రుతి తాళ మృదంగాది వాద్యంబుల సాయంబులేకనే యింత శ్రోత్రపేయముగనున్న నీగాన మీ యుపాంగముల సాయమున్న నాకెంతరుచిగనుండు నోగదా!

(తేటుబోఁ)

శ్లో. శివతవ పరిచర్యా సన్నిధానా యగౌర్యా।
భవమమగుణ ధుర్యాంబుద్ధి కన్యాంప్రదాస్వే।
సకలభువనబంధో సచ్చిదానందసింధో।
సదయహృదయ గేహే సర్వదా సంవసత్వమ్॥
(అని పాడుకొనుచు మహానంద ప్రవేశించును.)

మహా—అమ్మా! వీరికిఁ గావలసిన వన్నియుఁ జక్కఁగా నమర్చితివా?

మాత—నాచేత నైనంతవఱకు నమర్చితి. మిగతలోపంబులఁ దీర్చుకొను భారంబు నీచేతనున్నది

శంక—నీదయ నాపై పరిపూర్ణంబుగ నుండ నాకే కొరంతయు ఘటిల్లదు.

మహా—తమయట్టి మహాత్ములను గౌరవించుట అల్పజ్ఞులమగు మాచే నేమియగును. మాయందలి వాత్సల్యముచే నటులనియెదరు.

శంక—లేదు. లేదు. మీ యాదరణాతిశయము నాకమితానందము గల్గించినది. సంశయమెంతయును లేదు.

మహా—తాము తృప్తిజెందుటయే మాతృప్తి.

శంక—తృప్తికెక్కడిది లెమ్మా. తృప్తిగలిగిన వారెవ్వరేని భూలోకమున నుందురా? ఎక్కడిమాటయో యేల! మనభారతఖండము మాట మాత్రము. తృప్తిగలిగిన మానవు నొక్కని వేలుమడచి చూపుము. సంతసింతును.

మహా—ఇహసుఖంబులందా? పరసుఖంబులందా? ఆర్యా!

శంక—పెద్దమెత్తు నెత్తితివే! దీనికేమిగాని మహానందా! ఏదైనమంచి ప్రసంగము గావింతము.

మహా—తమ చిత్తము.

శంక—నీవు నిలువఁబడియే యుంటివే, కూర్చుండుము.

మాత—అమ్మాయీ! కూర్చుండుము. అయ్యవారు చాల తెలిసిన వారు. నీ వెఱుంగవా! లేకున్నచో వారిని నీయతిథులుగా నొనర్తువా!

మహా—(తనలో) ఈతం డొక శివభక్తుండని మాయమ్మ యెఱుంగదు కాబోలు. (ప్రకాశముగా) తెలిసినవారి యొండఁజేరి తెలియని వాటి గ్రహించుట యుక్తముగదా! గుణంబులు మంచివియైన నెవ్వరినైనను చేర్పఁదగును. (కూర్చుండును.)

శంక—ఏదీ! నీవు వచ్చుచూ పాడుచుండిన శ్లోకము—

మహా—శ్లో. శివతవపరిచర్యా సన్నిధానాయగౌర్యా
భవమమగుణ ధుర్యాం బుద్ధికన్యాంప్రదాసీ
సకలభువన బంధోసచ్చిదానందసింధో
సదయహృదయ గేహేసర్వదా సంవసత్వమ్.

శంక—దాని భావమును దెల్పెదవా!

మహా—అజ్ఞురాలను. అయినను నాకుఁదోచినంత వట్టు దెల్పెదను.

గీ. సకలసద్గుణ రాసియై । సంతసంబు
కలుగఁజేసెడు బుద్ధియన్ । కన్యగలదు
నాకడను ప్రీతిమైదాని । నీకొసంగ!
దలఁచితిని నన్నిటను నీవు । తగినవాడ
వౌటఁ బార్వతికిని దీని । నైకమత్య
మమరగాఁజేసి నీసప । ర్యలనునందు
చుండి సమదృష్టి వీక్షించు । చుండి నాదు
హృదయగేహమునందు వ । సింపుమయ్య
సౌఖ్యముగ సచ్చిదానంద! । సదయహృదయ
మోదమును గూర్చుమయ్య శం । భో! మహాత్మ.

శంక—బాగున్నది. బుద్ధియనెడి కన్యను శంకరార్పితమొనర్చుటకు సంసిద్ధురాలవు.

మహా—త్రికరణశుద్ధిగా!

శంక—ఆశంకరుఁడు పార్వతీకాంతుఁడు గాఁబట్టి పత్నిగాఁ బరిగ్రహించి కాపాడుకొనవలెనన్నమాట—

మహా—అవును.

శంక—శంకరుఁడు నీకుఁ బ్రత్యక్షమైనపుడు గదా వాని నర్పించెదవు.

మహా—చిత్తము!

శంక—అది చేకూరుటెట్లు?

మహా—వానిచరణంబులే శరణ్యంబని నమ్మి హృన్మందిరమున వాని భజించుటయే!

శంక—వాని రూపంబెట్టులుండునని యెఱిఁగినఁగదా! వానిగుర్తింపఁ గలుగుట.

మహా—చిత్తరువు లాధారములుగావా? వానిరూపరేఖలను వర్ణించిన మహానుభావుల గీతికలు లేవా! వాటి నాధారముగఁ జేసుకొని గుర్తించవచ్చును.

శంక—పండితులు వానిరూపం బెట్లుండునని వాకుఁచ్చిరేమి?

మహా—అవధరింపుఁడు:—

గీ. వ్యాఘ్రచర్మంబు వానికి । వస్త్రమంట
అవయవంబులు భూతితో । నలరునంట
పాములే భూషణములుగా । వరలునంట
చేతను త్రిశూలము ధరించి । చెలఁగునంట
గళమునందున విషముతో । గ్రాలునంట
గంగఁదలయందుఁ దాల్చి చె । లంగునంట

ఆమెపొంక్కనె శశిగూడ । యమరెనంట
పార్వతికి దేహమున సగ । భాగమిచ్చి!
యర్ధనారీశ్వరుండను । నట్టిపేరు!
పొందెనట! యింకిధాన చె । ప్పుకరుదేవ.

శంక—అట్లే యుండవలెననెడి శాస్త్రమున్నదా! సకలలోకేశ్వరున కిద్ది రూపంబని నిర్ధరించినవారెవరు? కాలముననుసరించి చిత్ర విచిత్రరూపంబులు ధరింపును. కిరాతుండై యర్జునునితోం బోరాడలేదా! సర్వాలంకారభూషితుండై ప్రమథగణముతో విరాజిల్లుచుండు వాండని మనము వినలేదా! నీవు చెప్పినవర్ణనమును బట్టి వానిం బూజించి మనమార్జించదగిన విశేషము లేమియుం గాన్పింపవే?

మహా—వాని నేమి యర్థింతుము. ధనమిమ్మనుమా! భోగములిమ్మందుమా! అంకలకే సర్వవిను లీవిధంబుగ నామహామహుని నారాధింతురు—

శ్లో. అశనం గరళం ఫణీకలాపో
వసనం చర్మచవాహనం మహోక్షః
మమదాస్యసి కింకిమస్తి శంభో
తవపాదాంబుజభక్తి మేవదేహి.

శంక—నా కటులం జెప్పిన నర్థముగాదు. చక్కంగా విశదీసి చెప్పినం దెలుసుకొందును.

మహా—చిత్తము.

గీ. ఇష్టమైనట్టి వస్తువు । యేమికలదు
నీకడను దేవ విషమెగా । నీకుభక్తి
ఫణులలంకారములుగావె । ఫాలనేత్ర
కట్టునది పెద్దపులితోలె । గా మహాత్మ

యెక్కసట్టి వాహనమూ యెక్క । దక్కసట్టి
వృషభ మేగద నాకేమి । యిచ్చెదీవు
త్వత్పదాంబుజములఁగొల్చి । ధన్యనగుటె
కోరెదను దానినే యొసం । గుము గిరీశ.

శం—నీ భగవదారాధనంబునకుఁ జాలసంతసించితిని. కాని మహానంద! నేనొక విషయమును గూర్చి నీతోడ ముచ్చటింపఁ దలఁచితిని. కోపగించుకొనవుగదా!

మహా—సద్విషయ పరిసంగంబునకుఁ గోపమొందుదురా?

శంక—మహానందా!

మహా—ఆర్యా! సెలవు.

శంక—

మ. పదునాల్గేండ్లకె చిత్తమంతయు శివ । బ్రహ్మంబుపై నిల్పి సం
పదలన్ భోగములన్ ద్యజించుకొనుచున్ । వైరాగ్యమున్ బూనగా
ముదితా! నీమది యెట్టులొప్పె దగునే । ముద్దారగాఁ బెంచి స
మ్ముద మొందంగను జూచు తల్లి వచనం । బున్ మట్టిపాల్సేయుటల్.

మహా—అయ్యా! యీభోగ భాగ్యంబులు నెంటవచ్చునవి కాకుండుటచేత—

మాత—అయ్యా! ఇదేనండి! దీనివెఱ్ఱి. అమ్మాయీ! నామాటవిన కున్నను యిట్టి పెద్దలవాక్యంబులైనను విని దారిలోనికి రావమ్మా!

శంక—కులవృత్తిని జూచుకొనుచుఁ బరాత్పరుని ధ్యానించి వాని దయకుఁ బాత్రులైన వారు లేరా!

మహా—కులవృత్తియందు గౌరవము మొదలంట నాశనంబగుట చేత యుక్తాయుక్త విచారము శూన్యమగుట చేత కులవిచక్షణ మేమి అంగసౌష్టవమేమి గమనించుట లేదగుటచేత బుజుమార్గంబు సున్నయగుట చేత ధనార్జనమే ప్రాధాన్యముగాఁ జూచు

కొనుచుండుటచేత భగవంతునియందు దృష్టి పారుటకల్ల. ఒక వేళ బాలినను చేసినతప్పులకు దండధరుని మ్రోల సమాధాన మొసంగనక్కఱలేదా? ఆ అగ్నిస్తంభముల మంటలకాగనక్కఱ లేదా? ఆ గద మొత్తింపుల నోర్చుకొననక్కఱలేదా? ఆపపు కోతలఁ బడనక్కఱలేదా? విషమృగంబులవాతలఁ జిక్కనక్కఱ లేదా? బుద్ధిపూర్వకముగా నట్టి యపచారముల నొనర్చనేల? ఇట్టి యవస్థలనంద నేల? దేవా!

శంక—ఆ శంకరుండే వచ్చి తనతో నతను కేళిఁ గూడుమని స్వయముగా నర్థించినచో.

మహా—ఆ మహామహుఁ డట్టు లర్థించఁడు. కాముఁడు వానిదెసకు రాజాలఁడు! ఏమందురా!

గీ. చిన్నపెద్ద విచక్షణ । విడచి మున్నొ
కష్టువానికిలేని సం । కటమొకండు
దెచ్చిపెట్టఁగఁ గోపించి । తెఱచిఫాల
నేత్రమును వానిరూపంబు । నీల్గఁజేసె.

శంక—అట్లైనను అనంగుఁడై యందఱను వేధించుచునే యున్నవాఁడు సుమా!

మహా—అవును తండ్రీ! విష్ణుమూర్తి గనుక వానియాట యంతవఱకై ననుసాగినది.

శంక—ఒక వేళ శంకరుఁ డర్థించు ననుకొనుము.

మహా—అర్థించిన నంగీకరింతు ననుకొనుము.

గీ. పాపమో పుణ్యమో దాని । భారమంత
తానె వహియించి యాదండ । ధరుని నడ్డ
జయము బొందంగ గలవాడు । శంకరుండు
గాన వానికోర్కెలఁదీర్చు । దాన నేను.

దండధరునితో పోరాడిగెల్చిన వానిచరిత్రము మున్ను వినియుండవా? ఆర్యా!

గీ. యముఁడు పాశంబుగొంచు రయానవచ్చి
గొనఁగనుంకింప శరణార్థి నను చువేఁడ
బోవఁడాకొక్క మార్కండేయుఁ బోజయము
బడసి యాకాలునింటికి ననువఁ జేసి.

మాత—అమ్మాయీ! ఈసంభాషణమంతయు నెందులకు. మహానుభావుఁడు నీపై భ్రాంతిఁగొని యున్నవాఁడు. నీ తనూవిలాసముఁ గాంచి నప్పటినుండియు వానిచిత్తంబంతయు నీపై లగ్నమై యున్నది. చాలధనికుఁడు సదయహృదయుఁడు నీవు నామాటలఁ జెవిఁజేర్పవని యెఱింగియుండియు నూరకొనలేక జెప్పెదను. ఒకనాటికిఁగాకపోయిన నొకనాటకైన గుణముఁ మార్చుకొనవలదా? ఈఆస్తియంతయు నెవరికొఱకమ్మా? నాముద్దుముచ్చటనొక్కనాఁడేని తీర్చుమమ్మా! నీ సుఖముఁ నీ యానందముఁ నాజీవితములో నొక్కనాఁడేని కన్నులకఱవుదీఱఁ జూచి యానందించు భాగ్యముఁ గలుగఁ జేయుమమ్మా!

మహా—అమ్మా! ఈవృథాప్రసంగ మెందులకమ్మా?

మాత—ఇది వృథా ప్రసంగమేనా. కూతురా!

సీ. సరిగంచుమించు వస్త్రముల కట్టుకనుండ!
గనిము దంబుగ భాగ్యంబు లేదె
తులలేనిభూషణం బుల దాల్చుకొనజూచి
యానందపడెడి భాగ్యంబు లేదె
పట్టుపాన్పులమీఁద పవ్వళించి సుఖముంద
గనులారఁజూచు భాగ్యంబు లేదె

సరసులతోఁ గూడి । సల్లాపములనాడ
నమ్మ! యాలించు । భాగ్యంబు లేదె

కావిగుడ్డలతో నిల్లు । కష్టపడుట
నిన్ను మూల్గుచు । పెట్టెలందున్న వస్తు
వాహనంబులఁ జూచుక । బ్రతికినన్ని
నాళ్లు నేనేడ్చుచుంట యే । నాఫలంబు.

కూతురా! నీవేమేమియో చెప్పుచుందువుగదా! తల్లి సమస్తభోగంబులను సమకూర్చి యిచ్చి యనుభవింపుమన్నఁ గాలదన్నుకొనుచు నీ రీతిని యేడిపించినపుడు మాత్రి మా దండధరుని మ్రోల సమాధానమొసంగ నక్కఱ లేదా! నీవు నాకు ధనము సంపాదించి యొసంగనక్కఱ లేదు. నీ యీశ్వర ధ్యానమును మాననక్కఱ లేదు. పదిమందితో సంచరించనక్కఱ లేదు. యోగ్యతగలవారిని, యీశ్వరభక్తిగలవారిని, సకల విద్యాపారంగతుని యొక్కరినే యాశ్రయించుకొని వారినే నమ్మి యుండుము. పోనిమ్ము. వ్యభిచారము నీవు చెప్పినటుల దోసమే యనుకొందము. సర్వసంగపరిత్యాగముఁ జేయవలసినదని [illegible] మహానీయులును ఘోషపెట్టుటలేదే. వైవాహిక పద్ధతి నవలంభించుకుని ప్రబోధించుచున్నారు. ఒకవేళ నీకు వివాహమే చేసినయెడల వానితోనైన సుఖంబుగ నుండెదవా లేదా! చూడుమా అయ్యగారిని రూపమునందు ప్రాయమునందు, నీకుఁ దుల్యులైయున్నవారు. నీవు వీరి యభీష్ట మీడేఱ్చువేని నీయిష్టదైవంబగు నా సదాశివమూర్తికిఁ గావలసినన్ని ముత్యములు, రత్నములు, వజ్రములు మున్నగునవి దయచేయుటయేగాక నీకు శాశ్వతోపకార మొనర్చెదమని వాగ్దాన మొనర్చుచున్నారు. అయ్యా! నిజమేగదా?

శంక—మమ్మాటికి నిజము.

మాత—అయ్యా! ఇంతయ్యిం తంటివాండు స్వయముగా వచ్చి వేడు కొన్నను దిరస్కరించిన బాలసుండే.

మహా—(తనలో) ఇమ్మహాత్మునియందుగు శివచిహ్నములు గానవచ్చు చున్నయవి ఇదియుంగాక నీతండు తప్పక శివావతారమే సుమీ! వీని కోరికె నిరాకరింపం దగదని నాయంతరాత్మ ప్రబోధించుచున్నది. లేకున్న ఎంద తెందలో వచ్చి కాళ్ళమీందం బడి బ్రాల్మాలినను అంగీకరించని నామనరం బీయనపై వలపుం గొనుట కేమికారణమ్మైయున్నను? ఓపరాత్పరా! నీవు నా యంతరంగ పరిశోధనం జేయుచుంటివా? నా కీరూపంబున భవదీయ దర్శనభాగ్యం బొసంగి నన్ను నీలో నైక్యముం జేసుకొను చుంటివా? పరాకునసేని దోసంబొక్కటియేని యెఱుంగని నిరపరాధినిగదా? దేవా! నిర్మలచిత్తంబుగ నాకిట్టిబుద్ధిని నీవొసంగి యుండెదవు. త్రిలోకాధారా! ఈరూపంబు తప్పక నీదే యని మనోవాక్కాయ కర్మంబుల విశ్వసించి యమ్మహాను భావునకు నాతనువు సమర్పింతును. ఏవిధంబగు పాపకర్మంబు నామెడనుం జుట్టుకొన్నను దానిని సైరించు భారము నీదే సుమా? రేపు నాదోసంబునకు సమాధాన మొసంగవలసి వచ్చునెడల నాయంతరాత్మయందు నీవు ప్రవేశించి నానోట నవాకులు చవాకులరాకుండం బాలించు బాధ్యత నీదే సుమా! నీవెంతటి మాయరూపంబున వచ్చి నన్నుం బరీక్షించి నను నీకు సమాధాన మొసంగం గలుగునంతటి దాననా? ఈ రూపంబు నీదికాదయేని కలలోనేనిం బరపురుషుని వలచి యెఱుంగని నేనిప్పు డొనర్చునది యకార్యమయేని నాతనువును నీ ఫాలనేత్రమును విప్పి భస్మీభూతముం గావింతువుగాక! భరించెదను. సంతోష పూర్వకముగ నామోదించెదను. హృదయ

పూర్వకముగ ననుభవించెదను. నీవయ్యె నన్నుద్ధరింపఁ దలంచి యీ మాయావేషమున వచ్చినది వాస్తవమై నీవన న్నిట్లు పుంగోల్పుట సమ్మతమై నే నొనర్చునది దోషంబుగాదయేని యేమూళను లోఁగొని నిన్ను భజింపుచుంటినో నీనామమంత్రంబు జపించుచుంటినో నీపాదారవిందముల పూజించుచుంటినో ఆ మనోరథ మీడేర్తువుగాక.

మాత—ఏమే అమ్మాయీ! పామును చావనీయవైతివి. బడితెను విరుగనీయవైతివి. బ్రతికినన్నాళ్లు బ్రతుకనుగదా! ఇదివఱలో నామాట వినకున్నను యీ ఒక్క విషయములో వినుము. నీ వీసమయమున నిరాదరింతువేని కూతురా! ఇటుఁ జూడుము. ఈ హారము నవరత్నములతోఁ గూర్పఁబడినది. వెలయింతయని నిర్ణయించుట కశక్యమైనది. దీని జేఁజార్చుకొనవలయును. ఇట్టి అమూల్యహారము లెన్నియో యిత్తురు. వీరు శివభక్తాగ్రేసరులని వీరిమెడ నలంకరించియున్న రుద్రాక్షమాలికలును, లింగమును చెప్పుచున్నవి.

శంక—మహానందా! మా అమ్మచెప్పు వాక్యంబుల నాలింపుము. నేను నీవనుకొను నంత గూఢాచారుండను గాను. మేము మాత్రము దైవమునారాధింపమా? పూజించి మఱచి తిరుగుదుమా? పాపపరిహారంబునకై స్నాన మొనర్తుము. విభూతిని ధరింతుము. శివభజన గావింపము. వానికి నివేదనగావింపనిదే మేమే పదార్థమును భుజింపము. దయాసత్య శౌచాదుల మేమును పరిపాలింతుము మేమును మోక్షమునే గోరుదుము. ఆ చిద్విలాసుని దివ్యకథలను మేమును వినోదంబుగ నాకర్ణింతుము. మరియు

మ. జపహోమక్రియ లాచరించి ఫలముఁ । సాధింపఁగానౌనొకో
యుపవాసంబులఁ జేసినంతనె ఫలం । బున్నే సదామానసం

బహువర్గంబులఁ ద్రొక్కనీయక బ్రహ్మో । ద్యానమున్ వంచియూ
కృపనీయుం దలపోతు మేని యిడఁడే । యిష్టార్థముల్ ప్రీతిమై.

మహా—దేవా! తమరు దైవధ్యాన పరాయణులు గారని వక్కాణింపను. ఈవృత్తియందుఁ గల దురాచారములను బట్టి యద్దాని నిరసించితిని ఆకైలాసవాసుని ఆరంగద్విలాసుని ఆసచ్చిదానంద స్వరూపుని భజించుటయందు విఘ్నంబుఁ గల్గింపలేని తమరు మా అతిథులుగ నున్నప్పుడు మీయిష్టార్థంబులఁ దీర్చుట మా విధాయకంబని నిశ్చయించుకొని మొడఁబడుచున్నదానను. గాన ననుగ్రహింప వేఁడెదను.

మాత—అయ్యా! నేను నిక్కముగ ధన్యురాలనైతినండి. ఇఁక మీదయ. ఈనాఁడు నేను లేచిన ఘడియ చాలమంచిది. అమ్మాయీ! (కౌఁగలించుకొని) నాజన్మపవిత్రమైనదే! నీవు నామాట వినినందులకు నీవు ప్రతిష్ఠించిన యీ సచ్చిదానంద స్వరూపునకు యీ హారమును సమర్పించుకొనియెదను. మఱియు నీకుఁగొన్ని యమూల్య భూషణంబు లిత్తును. వాటిచే నాచేతిమీఁదుగ నాభగవంతుని యలంకరింపుము.

మహా—అమ్మా! నీవు సన్యసింపరాదా! నీవా స్వామిఁ బట్టి భాగ్యము నోచుకొనలేదా! ఇఁకనైన నా సదాశివుని నారాధించుకొనుచు నిత్య ముముక్షు మార్గంబు గ్రహింపరాదా! వయసు తీఱి జవసత్త్వంబు లుడిగినపిమ్మట యింకనీవు చేయునదేమి!

మాత—ఆలాగుననే నమ్మా! నీవు నామాటవినుచు నాకింత యానందంబొడఁగూర్చు చుండునప్పుడు నేను భగవంతుని ధ్యానించుకొనక నేమిచేయుదును.

మహా—నాకు చాలసంతసంబైనది. కాని అమ్మా! నీకు మూఁడు విషయములు చెప్పెదను. ఏవనగా!

గీ. కల్లుసీళ్ళరు ద్రాప్రుట । సల్లనుందు
తిఁటఁ జుట్టపీకెలగాల్చు । చుంటమాని
శుచిగనుంపుచు నాపరి । శుద్ధచరితు
భక్తితోఁగొల్తువా నీకు । ముక్తిగొసఁగు.

ఇదే నేను చెప్పఁదలచుకొన్నది. నీమాట వినినందులకు నామాట యందలి యుక్తమును గూడ గ్రహింపుము.

మాత—అమ్మాయీ! అట్లాగే! దానికేమి! ఇంతవఱకు మూఢురాలనై తిరిగి నేర్చుకొన్నవిద్యలు గనుక విడిచిపుచ్చలేకున్నాను. ఒంటికి పట్టుంటుందని చెప్పినారమ్మా! ఈ గుర్రిక్కాడు ప్రాణంపోయిన ఆమహానుభావుని చరణములవద్దనే పోవును. ఇకటినుండి యీశ్వరధ్యానము మనకు వచ్చినవిద్య ఇతరులకు నేర్పుటమున్నగు సత్కార్యములయందు నాతను వప్పించెదను. ఇక నేంబోయెదను. ఈమహానుభావుని నెట్లుగాపాడుకొందువో నేను జెప్పఁజాలుదును?

(నిష్క్రమించుచున్నది.)

శంక—మహానందా! ఇప్పటికి సంపూర్ణముగా ధన్యుఁడనైతినిగదా!

మహా—మీ చరణసేవ లభియించినందులకు నాతనువు కృతార్థత నొందలేదా!

శంక—మీ యమ్మ నీకు చేసిన మహోపకారము నీవువఁబువఁదగనిది సుమా! ఈ అద్దములు యీ శృంగారపటములు యీ తూగుటుయ్యాలలు యీరంగులతివాసులు యీ పంకాలు యీఅత్తరుదానులు యీ దివ్యభవనము ఆ చలువరాళ్ళతిన్నెలు యివియన్నియును నీకొఱకేగదా!

మహా—నాకొఱకేగాని దేవా! ఇవన్నియు నస్థిరపదార్థములు సుండీ!

శంక—పదార్థమునకు నాశనమెచ్చటిది? గాని ఈ వేదాంతములలోనికి మఱల దిగకుము. సుందరీ! ఇది వేదాంత ప్రసంగమునకుఁ దగిన సమయముగాదు. చూడు.

గీ. కావిగుడ్డను దీసి చక్కగను । గుడులు
దువ్వి జలకంబులాడి క । స్తూరిబొట్టు
పెట్టి తెల్లని జలతారు । బట్టఁగట్టి
నగలధరియించి వేరమ్మ । మఱవపొమ్మ.

అట్లు చేసిన కోరిక నెరవేర్తువు! నేనర్థించిన కోరిక సార్థకంబగునుగదా!

గీ. పట్టుపాన్పున సుఖముగఁ । బవ్వళించి
సరససల్లాపములఁ బ్రొద్దు । జరుపుకొనుచు
జత్రిరతి బంధములఁ దేలి । చెలియమనము
స్వాంతముల కెంతొ హాయి ను । సంగఁగలము.

మహా—(సిగ్గుతోఁ దలవంచుకొని) మహానుభావా! మీరా కామపిశాచమునకెంత చులకనఁగ జిక్కినారలు? మీరు మిక్కిలి నన్నుఁగూడ సజ్జురాలనుగఁ జేసితిరే?

శంక—చెలీ! ఆ కాముకుని దాడియొక్క ప్రభావమట్టిది. చెఱకు శింగాణి చేత సారించి పుష్పంబు లొక చేతఁదాల్చి యా యంగజుఁడు విజృంభించుచుండ వానితోఁ బగసాధింప నెవ్వరైన నియ్యకొందురా! నీవేమి? నేనేమి? అఖండతపస్సంపన్నులై యోగీంద్రులే వానికి లొంగిపోవ నిఁక మనమా?

మహా—మీమాటకు సమాధాన మొసంగుటయనఁ దిరస్కారణముగ బరిణమించునేమో?

శంక—ఇంకలకు నీవు పూర్వపక్ష మొసర్పఁజూచినను లాభంబులేదు. ఏమందువా?

గీ. ఏమహాత్ముని దయగాన । నింతకాల
మిటులనుంటివో యాతఁడే । యెదుర లేక
లొంగిపోయెను గాదె యా । యంగజునకు
గాంతమన మెంత వానితో । పంతమాఁడ.

ఇంతయేల! వానికి నావిషయమున త్రే లేవు. రూపము లేనివానిగాఁ జేసి యాశివుఁడు విడిచిపెట్టెను వానియాటలు పోయినవా? చూడు.

గీ. తండ్రిహరియేగదా వాని । తల్లిలక్ష్మి
యేగదా తల్లిదండ్రుల । నేయనేక
విధులఁద్రిప్పలు పెట్టంగ । వేగలేక
నున్నవారికి మనమెంత । సన్నుతాంగి.

మహా—దేవా! ఇఁకమన వాదప్రతివాదములు చెట్టుముందా విత్తు ముందా యను దానిననుకరించును. కనుక యీవాదమును జాలింపుము.

శంక—మంచిది. అట్లయిన నీవు వేగఁబఁబోయిరమ్ము.

మహా—చిత్తము. (నిష్క్రమించును.)

శంక—(స్వగతము) ఈకాంత సురూపసంపద యయ్యును పరపురుషుల సాంగత్యమెట్టిదియో యెఱుఁగక, యిహలోక బాంధవ్యమునే వీడుకొని, కేవలమదీయ నామమంత్రపఠనాభిలాషచే మెలఁగుచున్నదను నారదవాక్యంబులు స్థిరములగుటయెగాక స్వయంబుగఁ బరీక్షించు భాగ్యంబుగూడఁ గలిగినది. నేనే యీశ్వరుఁడనను భావ మీకాంతకు గోచరించినటులఁ దెలిసెడిని. ఈమెకింక సాయుజ్యమొసంగుట కెట్టియాటంకము నుండదు. ఈమహానంద పవిత్రచారిత్ర. భారతఖండములోని వేశ్యకులంబున కొకగుణపారముగ నుండుఁగాక! నారదుండు కలహాశనుండగుటచే మహానంద శంకరునివలలోఁ బడినదను వార్తను దేవే

దుని కెత్తఁగింపక పోఁడు. అతఁడు కక్షసాధించుట కేయుక్తిని బన్నునో? కానిమ్ము! సాయుజ్యదానకర్తను నేనుండ వానిపగ మహానంద నేమిచేయఁగలదు?
(అటు నిటుఁ జూచి) అదుగో! నవమోహనాంగి వచ్చుచున్నది. నేను మఱల నెప్పటియట్ల నుందును!
మహా—(ప్రవేశించి సిగ్గుచే నిలువఁబడును)

గీ. త్యాగినివి నీవుక్షణములో । భోగినివయి
వచ్చినంతనె సిగ్గేటు । వచ్చెనీకు
రమ్ము ముద్దిమ్ము కౌఁగలి । నిమ్ము నీవు
కులుకుగుబ్బల నురమున । గ్రుచ్చనిమ్ము.

మహా—(చూడఁడకఁదలవంచుకొని సిగ్గుచేతనే నిలుచుండును.)
శంక—(లేచి) మదవతీ! ఇప్పటివఱకును చక్కఁగఁ గూర్చుండి వెడలినదానవేగదా! వాదంబు లాడినదానవేగదా! నా ముందుఁ బాటఁ బాడినదానవేగదా! నాకాతిథ్య మిచ్చినదానవేగదా! నాకు శ్లోకార్థములఁ జెప్పినదానవేగదా! నీతల్లికి నీతి నుపదేశించినదానవేగదా! ఇంతలో నేనా! నెలఁగడచెనా? దినములుగడచెనా? సర్వాలంకార భూషితవై యాచంద్రుని పరిహసించుచుంటివను గర్వము కాఁబోలు! సంపెంగను ధిక్కరించుముక్కుగలిగి యుంటివను అతిశయముకాబోలు! కమలపత్రంబులను ద్రోసిరాజనెడు నేత్రములున్నవిగదా యనెడు సంతోషముగాబోలు! అంతియేనా?
మహా—(ఊరకుండును)
శంక—చూట్లాడవేమి! సుందరీమణీ:—

గీ. ఎదురుగావచ్చి కౌఁగలి । యిచ్చి నిన్ను
దేర్చితినిగానటంచు నే । దీవు నిపుడు

పరిహసింపంగ జొచ్చి నా । వా మెయంగఁ
జేతు వేని క్షమాపణఁ । జెప్పుకొందు.

అట్లుఁగాక:—

గీ. వచ్చిన విధానము నెఱింగి । వచ్చి కొంగు
నందు నేమైనఁ గట్టి యా । నందపఱచి
సిగ్గుఁదీర్చనటంచును । చిన్నతనముఁ
దేవనారీతినీవుండి । నావె? తరుణి.

మహా—(ఓరకంటను జూచును.)

శంక—అటులనా! ఇదియేనా నీకోపము:—(లేచిదగ్గఱకుఁజోవుచు)
అట్లయిన నిదిగో చూఁడు!

గీ. ప్రాణపదముగ దేనిఁ గా । పాడుకొనుచు!
నింతదాక మెలఁగితో । యింతి యట్టి!
లింగమును గట్టుచుంటి నీ । కొంగునందు!
రమ్ము సిగ్గును ద్యజియించు । కొమ్ముపడఁతి.

అని కొంగునఁ గట్టి చేయిఁబుచ్చుకొ దీసికొనివచ్చి) తరుణీమణీ—ఈ
లింగమును నేనెంతజాగ్రత్తగనో రక్షించుకొంటిని.

గీ. తలఁచినతలంపులను దీర్చఁ । గలదు హృదయ
మునకు మలినఁబుఁ జేరనీ । కను విశుద్ధ
గతిని నుంచును మోక్షస । ద్గతికి మూల
కారణంబుగ నుండు లిం । గంబు మగువ.

నీ వీ వస్తువును పరుల కంటబడని తావునందుంచి నిర్మలభావంబునఁ
బూజింతు వేని:—

గీ. మానినీమణి రుద్రాక్ష । మాలతోడి
వ్యాఘ్రచర్మంబునుఁ వల్లె । వాటు వేసి

కొనుచు, ఫణిభూషణతతి కంఠ । మున వెలంగ
శంభుదేవుండు నీకు సా । క్షాత్కరించు.

దీని నేవిధాన గాపాడుకొందువో. ఇదియొ దేనఁ బోయినచో నాప్రాణం
బుల నిష్కారణంబుగఁ ద్యజియించుకొనవలసి వచ్చును. నీకీ నా ప్రాణ
మానంబుల ధారవోయుచున్నవాఁడనగుట చేతనే యింతప్రాణతుల్య
పదార్థమును నేను కానుకగా సమర్పించితి.

మహా—దేవా ! నేనుమీచేఁ జక్కఁగా ననుగ్రహింపఁబడితిని

శంక—మనోహారిణీ ! ! మనమిచట నుండి పోయి యీ యుద్యానవనం
బున కొంతతడవు విహరించి పదపడి వత్తము రమ్ము.

(నిష్క్రమింతురు.)





శ్రీ

# మహానంద.

## పంచమాంకము.

రంగము :—[ఇంద్రుఁడు, ఏకాంతముగ.]

ఇంద్రుఁడు.—ఇంతటివాఁడనన్న తారతమ్యము లేక నెంతపనిచేసినది! ఇందులకుఁ బ్రతిక్రియా విధానము నాకడ లేదని యూహించెం గాఁబోలు. పరపురుషుని కన్నెత్తి చూడదట. నాకన్న నేమంత మహారసికుఁడని యాశివుని మాయలోఁబడినదో? నారదుఁడు చెప్పిపోయిన విషయము నిజమైయుండునా? అహల్యాజారుఁడనై లెక్కలేని యప్సరాంగనల మెప్పుల నందిన నేను నారూప సంపద తనకు లెక్కకు రానపుడు నొడలంతయు బూడిదెఁ బూసికొని స్మశాన నివాసమొనరించు శివుఁ డెటుల రూపవంతుఁడై గాన్పించెనో! ఆహా! స్త్రీలకు రసారస విచక్షణ లేదు గదా! ఇది యంతయు దృష్టిలోనున్న దోషమే గాని యొండు గాదు. ముముక్షుమార్గం బార్జింపఁ దన్నాశ్రయించుచు జరియించుచున్న యొక సామాన్యవనిత. అందునను భక్తురాలిని శివుఁడేమి? మోహించుటేమి? శివునకు వలపుఁ దెలియునా! శివునే వరించనిమ్ము. విష్ణువునే మోహించనిమ్ము. నాకేల? ఆతురాత్మురాలు నాకు గావిం

చినపరాభవంబునకుఁ దగినప్రతిక్రియ యొనర్చువఱకు నాహృదయంబు శాంతిపడనేరదు. నేనిప్పు డేమిచేయనగును? మాయవేసంబు ధరింతునా? మఱలఁబోయి చోరగ్రహణ మొనర్చిన బా[illegible]గుందునా? ఛీ! ఛీ! ఇదిపౌరుషకార్యములుగావు. కర్తవ్య[illegible]? ఆచార్యునితో నాలోచించిన నేమగునో! (ఆలోచించి) ఆతఁడిట్టికార్యంబుల కొడఁబడువాఁడు కాఁడు. మీఁదుమిక్కిలి చీవాటులకు మొదలిడి పాతపురాణములను బయటకుఁ దెచ్చును. అందువలన వ్యవహారమును రట్టుచేసిన వాఁడనగుట యేగాని ఫలంబుగాన్పడదు. నారదుని తోడనే యాలోచింతమనుకొంటిని. కాని కలహాశనుఁడు వార్తల నందించుచున్నఁగాని వానికడుపునిండదు. మున్ముందుగనే మదీయాలోచనమును వారికెఱుఁగఁజేయును. వారుజాగ్రత పడియెదరు. అందుమూలమునను బ్రయోజనమున్నట్టులఁగాన్పించదు. పరాభవానలంబుఁ జిత్తంబుతయుఁబొపరి విధములఁ బోసాగుటచే నాకిదికర్తవ్యంబని గోచరింపకున్నయది. ఆకఠినాత్మురాలిని మదీయవజ్రంబున కెఱఁజేయుదునా? కాదు కాదు. ఉన్నవాటికిఁదోడు స్త్రీహత్యాపాతకదోషము జతకాగలదు. ఆహా! నేనీకార్యంబున కేలఁబూనుకొంటిని? పూనుకొంటినిపో! ఆశాహతుఁడవుగానేల? మీఁదుమిక్కిలి సర్వదష్టుడనై శరీరమున కీవన్నెఁ దెచ్చుకొననేల? అయినకర్మంబునకు వగచుచు నింకనూరకుండుటయేనా కర్తవ్యము? కాదు. పౌరుషహీనమైన జన్మముగాదా అప్పుడు. నే నిప్పు డే కార్యమునకుఁ బూనుకొందమన్నను నా కుటిలాత్మురాలికి శివుఁడును వానికిగాను నారాయణుఁడును బాసటకాకుందురా! (సగర్వముతో) వీ రందఱేకమై నన్నేమిచేయఁగలరు? వాయుదేవుఁడు అగ్నిదేవుఁడు యముఁడు వీరు నాకు బాసటకాకుందురా! ఏమో!

దొంగముండకొడుకులు వారిని దూరనేల? నేనుకావించిన పని యుక్తమా! అయుక్తమా యను యోజన నాకుండవలయును. ఇం దయుక్తమేమున్నది? వేశ్యకులజురాలుగదాయని అర్థింపఁ బోయితిని. వేశ్యలు ధనముకాసింపరేమి? అబ్బా! మానసంబుతయుఁ గలతవడి వృథాయాసముఁ బెట్టుచు లేనిపోని వితర్కములోనికి దింపుచున్నదే? పరిభవదావానలంబాలు తెలాగుగదా మనకిప్పుడు కావలసినది (ఆలోచించి) ఆఁ! ఇట్లుచేసెదగాక (అటునిటుజూచి) ఏరీ దేవకన్యకల నీవనంబున కతిత్వరితంబుగ రమ్మని చెప్పియుంటినే! ఆ, అరుగో వచ్చుచున్నారు. రానిమ్ము. వీరినచ్చోటునకు నృత్యము నేర్చుకొను నెపంబునఁ బంపి నమ్మకముగనుండి దానియింటికి జిచ్చుఁ బెట్టించెదఁగాక. దానితో నామనూపంబు లడంగి పోవును. నామాట జల్లారును.

(దేవకాంతలు ప్రవేశింతురు.)

ఇంద్రు—ఓ కాంతలారా! మీరు తక్షణంబున మహానంద యింటికిఁబోయి దానితల్లికడ నాట్యమునేర్చుకొను నెపఁబునఁబ్రవేశింపుఁడు. మహానంద యీంవఱలో మిమ్ములఁ నెఱిఁగినది కావున మిమ్ముల నమ్మకుండు నేమో!

కాంతలు—ఆసంగతిమేము చూచకొనియెదము లెండు. దేవా!

ఇంద్రు—మంచిది. ప్రభుచిత్తమెఱిఁగి యుక్తముగజరించు కాంతామణులని నేనెఱుంగనా! సుందరులారా! నాకా శివాలయమున జరిగిన పరాభవమును మీరు కన్నులారఁ జూచినదేగదా? ఈ వికృతాకారముతో ముల్లోకాధిపతినైన నేనెట్లు సంచరించఁ గలనో తోచకున్నయది. నాటనుండి నేటివఱకు నిద్రాహారంబుల విసర్జించి ఘరిపాలనాది వ్యవహారంబుల వంకనైనఁబోవకుండ

నా దురాత్మురాలి నెట్లువంచింతునా యని యాలోచించు చుంటిని.

దేవకాంత—మహానుభావా! తప్పక బ్రతిక్రియఁ జేయవలసినదే! ఊరకుండతగదు.

ఇంద్రు—కావుననే మీరట నమ్మకముగ నుండునట్లుండి నృత్యశాలకు నగ్నిహోత్రుని దగల్చవలయును.

దేవకాంత—చిత్తము. దేవా!

ఇంద్రు—కారణంబేమో యెఱుంగుదురా! మహానంద అంతవిను ఖరగా మాట్లాడియు శంకరునిపై భ్రాంతిఁగొని యున్నదట. వారెల్ల వేళల నా నృత్యశాలయందే వినోదముగఁ గాలంబు గడపు చుండెదరట. అందుచేత మనముద్దానిని భస్మీభూత మొనర్చినచో వారిశృంగార విలాసముల కంతరాయములు గల్గించిన వారమగుదుము. అంతటి విలాసభవనము దహన మైనందులకు విచారించి మహానంద ప్రాణపరిత్యాగముచేయును. దానితో మనవిచారమడుగంటును. ప్రభుకార్యమునందు మీరే మాత్రమును యేమఱియుండరను విశ్వాసము నాకెంతయో గలదు. మీ రీ కార్యమునందు సఫలీకృతులైనచో మీకు లభించు పారితోషకములను గూర్చి యిప్పుడు చెప్పనేల!

దేవకాంత—ప్రభువుల యనుగ్రహము.

ఇంద్రు—మీకింక సెలవొసంగితిమి. పోయిరండు.

దేవకాంత—చిత్తము.

(నిష్క్రమింతురు.)

ఇంద్రు—దీనితో మహానందకు బూర్ణముగ గర్వభంగము జరుగును. మదీయశక్తి సామర్థ్యంబులనైన గుర్తెఱుంగక నింతచేయునే! ఆ త్రొత్తుకూతురి యున్నత్తత లడంగుటయే నాయానందము.

అబ్బా! ఈ సంతోషకరవార్త వినువఱకు నాకు నిముసమొక యుగంబుగా దోచునుగదా! ఏమిచేయుదును ? ఎప్పుడా ఎప్పుడాయని యువ్విళ్ళూరుచు వేచియుందును.

(నిష్క్రమించును.)

## ద్వితీయరంగము.

శివాలయము:—[శివునిఁ బూజించుచు మహానంద ప్రవేశము.]

(కీర్తన)

దేవా! మదీయయీప్సితంబు లీడేరుటకును నాపాపంబులు పటాపంచలగుటకును నా నాలుక నిన్ను నుతించుమనియు హృదయ కమలము నిన్ను ధ్యానించుమనియు శీర్షంబు నీకు నమస్కరింపు మనియు చరణములు నీకుఁ బ్రదక్షిణము లొనర్పుమనియు కరములు నిన్నుఁ బూజించుమనియు నేత్రంబులు నీదర్శన భాగ్యంబు లభింపఁ జేయుమనియు వీనులు నీ కథాశ్రవణము నొదఁజేయుమనియు నన్ను బ్రార్థించుచుఁ దొందరించు చున్నవి. నీ సెలవులేనిదే వీటిమనోరథము లీడేర్పఁ గంకణముఁదాల్చితినన్న కోపమా! తండ్రి! మహాదేవా! ముల్లోకముల ప్రభుండనందురు. ఆ గిరిమీద నివాసమేల? సకల రాజసములుగల వాడనందురు. గోచిగుడ్డకుగూడ గతిలేనటుల వ్యాఘ్ర చర్మంబును ధరింతువేల? భోగభాగ్యంబులెన్నో గలవందురు. పుత్త్రి నొకదానిచేఁ గొని బయలు వెడలుదువేల? నీవు నీకుటుంబసహితముగ నొక్కమాఱు దర్శన మీయరాదా? నిన్నుఁదనివిదీఱ సుఖింపఁ జేతునే! నీపాదముల నొత్తుదునే! నా సర్వాంగముల గోల నడచివైతునే! ఏల ప్రసన్నుడవుకావు? నేను పరాధీననైతి నన్నకోపమే నీకుఁ గలదు. నీవేయని నమ్మితిని. నీ మనోభీష్ట మీడేర్పకుండుట దోషమని లొంగి తిని. నీవు మన్మనోభీష్ట మీడేర్తువని విశ్వసించి యీపనికి దిగితిని.

అప్పుడే యీపాపము నన్నుఁ జేరకుండుగాకయని నిన్నుఁ బ్రార్థించితిని. నా అంతరాత్మ నన్నావిధంబునఁ బ్రోత్సాహించుటకు నీవు గారణ భూతుఁడవుగావా! నీ సహాయము లేనిదే మానవుఁ డేపనికేని నసమర్థుఁడేగదా!

మాత—(తొందరగా బ్రవేశించి) అమ్మా! అమ్మా! ఇంకేముంది. ఇంకేముంది! (అని యేడ్చుచున్నది.)

మహా—(ఆతుర్దగా) ఏమమ్మా! యేమి? యేమి?

మాత—ఇంకా యేమి యేమి. నృత్యశాలయంతయుఁ దగులఁ బడి పోయినది.

మహా—హా! ఈశ్వరా! (అని క్రిందఁబడుచు.)

మాత—అయ్యో! ఎంతగతిపట్టినది!

మహా—(లేచి) అమ్మా! నిప్పు యేలాగున నంటుకొనినది.

మాత—అదేమో ఇంద్రజాలమువలె నున్నది. మనవద్ద నాటనేర్చు కొనుటకువచ్చిన యా కాంతలు మాయమైనారమ్మా!

మహా—అయ్యో! అగ్నిలోఁ బడిపోయిరేమో.

మాత—లేదమ్మా! లేదు. యింటికి నిప్పుముట్టుకొనగ వెంటనే మాయమైరి.

మహా—ఇది వారిక్లోన్చినపనియేనమ్మా! ఎంతనమ్మకముగాఁ జరిపుచు గొంపతీశ్వినారమ్మ! అయ్యో! తల్లీ! యింకేమిగతి. ఆ మహానుభావుఁడొసంగిన లింగమును అందే యుంచి ప్రాణ పదముగాఁ గాపాడుచుంటిని. అది యేమైపోయెనోగదా! అమ్మా! ఈ వార్తవిన్న నాపుణ్యచరిత్రుఁ డిక జీవించునా? అక్కటా! ఎంత నిర్భాగ్యురాలను. హాదైవమా! ఇదియా నీపరిశోధనా విధానము. నిన్నుఁ గొల్చుఫలితమాయిది. నిన్ను భజించుచున్నందులకుఁ బ్రతిఫలమా! నీవు నాకొంసగెడు

మోహమిదియా! భక్తులగృహంబుల దహన మొనర్చుట నీకు విధియా! శివశివా! ఎంతలెంతలో ఘనకార్యములొనర్చి ముల్లోకములందుఁ గీర్తిగౌరవము లార్జించిన నీయట్టి మహాను భావుఁడు చేయఁదగిన కృత్యములా యివ్వి! ఇట్టియాపదల యందాదుకొన లేనివాఁడవు మహాప్రళయము సంభవించి స్థావరజంగమ రూపంబగు ప్రపంచంబంతయు నశించుచుండఁ దన్నాశనంబునకు వెఱచి దేవతలు మునులు మున్నగువారందఱు బలాయనమగునపుడు మహాధైర్యశాలివై మహదానంద భరితుడవై యొక్కఁడవు సంచరించితివటగదా! అదియంతయు గల్లయేనా! స్వామీ! అమృతముకొఱకు క్షీరసముద్రంబును మథించునాఁడు బెనుమంటలు మింటనంట వెఱగంది బృందారక బృందములు గోలపెట్ట నాకాలకూటమును గళమునందుంచుకొని మహోపకార మొనర్చితివట. అది యసత్యమేనా! అట్టి సాహసకార్యములు వాస్తవములేయైన యీ స్వల్పాపద నివారించుట నీకు భారమయ్యెనా తండ్రీ! (ధైర్యముతో) ఓశంకరా! ఆపద్బంధూ! యింతమాత్రమున వెఱువను. ఇది నీకార్యముగాదు. ఇంద్రుఁడు తనకుఁగలిగిన పరిభవంబునకుఁ బ్రతిక్రియఁ జేయఁదలఁచి చేసినకుట్ర. ఇది నీకృత్యమే యగుచో నాదేవకాంత లదృశ్యులగుటకుఁ గారణమేమి? నాయనా! సదాశివా! నేనిపుడామహానీయుని కేమనిప్రత్యుత్తర మీయను. ఏ ముఖమున వానిగాంతును. వానిలింగము నేవిధంబున వానికి జూపుదును. కాలిపోయినదని విన్నవింప నాతఁడిక ప్రాణముల తోడనుండునే? కడుజాగరూకతతోఁ గాపాడి యొప్పగింతునని యభయమిచ్చితినే? దానినే పూజించుచున్న నాటఁగోలె నామనంబున కెంతసూ యానందముగ నుండెనే!

నీపూజావిధానములకు నా కెంతయో ప్రోత్సాహదాయకముగ నుండెనే ! ఇప్పుడునా కేది దారి ? (ప్రి) తల్లీ ! మంటలేమైన జల్లారెనవా ?

మాత—లేదమ్మా ! లేదు—

మహా—అటులైనఁ దొందరగ నడువుము. నే నాయగ్నిమధ్యఁ జొరఁబడి లింగ మేమైనదో చూచెద.

మాత—అయ్యో ! తల్లీ ! గోరుచుట్టుపై రోకటిపోటా ! పసిదానవు ! నీవేమి యగ్నిహోత్రుని పాలగుట యేమి !

మహా—అమ్మా ! విచారింపకుము. నామనోహరుండగు శంకరుండగు శంకరస్వామి దయయున్నంతవఱకు నాకెట్టిభయమును లేదు. ఇది యింద్రునిఁ ద్రోసిన్చిన కుటరి. దుర్మార్గులకుటరి. సదాభక్తులగు వారి నేమియుఁ జేయఁజాలదు. నా తనువంతయు శివమూర్తితో లీనమైయున్నది. నన్నీమంటలేమియుఁ జేయఁజాలవు. నేనిప్పు డా లింగమునుగూర్చి జూడకున్నఁ బాప మాశంకర శెట్టిగారు నిష్కారణముగాఁ బ్రాణములవాయుదురు. "నాజీవితమంతయు దీనిపై నాధారపడియున్నది జాగ్రత్తసుమా. ఇది యన్యథా మైనచో నేనుతప్పకఁ బ్రాణములు విడుతునని" పదింపదిగఁ జెప్పుచు నాకు సమర్పించినారు. నేనిప్పుడాలసించుటకు వీలు లేదు. (అని నడుచుచుండ)

మాత—అమ్మా ! నేనింక బ్రతుకఁగలనా ! నిన్నుఁబాసియుండఁ గల్గుదునా ? నాకేమిగతి తల్లీ !

మహా—తల్లీ ! ఆ పరమేశ్వరుని యాజ్ఞగాఁగాని యొరుల ప్రాణముల గాపాడుటకైఁ యొనర్చఁబోవు కార్యమునకుఁ గంటనీ రొట్టఁ దగదు ! అంతియఁగాక. దీనియదార్థమిది !

గీ. ఎందులకటంచు నీవు భ । జించుచుందు
మో జనని! యట్టి దానిని । నొసగుముందు
యిట్టి శిషను పరీక్ష లే । న్నేనిఁ జేసి
మనదు ధైర్యమ్ము జూతురమ్మా! నిజమ్ము.

తల్లీ! యింకనిలువనేరమ్ము!

(నిష్క్రమింతురు)

## తృతీయరంగము.

[మహానంద విచారగ్రస్తయై ప్రవేశము.]

హా! హా! ఎంతపనిజరిగినది. నామనోహరుఁడు వలదన్న వినక, ప్రాల్మాలిన నూరకొనకఁ దనలింగము బూడిదెయైపోయినదన్న దుఃఖమునఁ బ్రాణత్యాగమును జేసుకొనుచుండిరే. నేనేమని గోలపెట్టెదను. ఇంకేమిచూచుకొని జీవింతును. నిష్కళంకమూర్తిని సదా యీశ్వర చరణారవింద భజనానందుని సంతత ఋజుమార్గ ప్రవర్తుని, సాధుశీలుని, పవిత్రచారిత్రుని నెట్టిదుర్గతికిఁ దెచ్చితిని. హా! దుర్భరము. భరింపఁజాల. నాప్రాణేశ్వరుని బాసి బ్రతుకఁజాల. ఇట్టి యపకీర్తిని బెట్టుకొని మనఁజాల. ఓసదాశివమూర్తీ! ఓఆర్తత్రాణపరాయణా! నాజీవితేశ్వరుఁడు ప్రాణములు వదలుచున్నాఁడు. నామనోహరుఁడగ్నిహోత్రుని పాలగుచున్నాఁడు. అనాథనగుచుంటిని. రక్షింపుము. రక్షింపుము. అడుగుల లెక్కించుకొనుచు వచ్చుటకిది తరుణముగాదు. (మంటలవంకఁజూచి) ఓఅగ్నిహోత్రా! యుత్తమచారిత్రుండగు మహానుభావుని, యీవిధముగ నీవాహుతిగఁ గొనుట ధర్మముగాదు. ధర్మముగాదు. నీప్రభావ మీయన దలపైనఁగాదు. మహాప్రభూ!

సీ. పరసతీమణులపై । భ్రాంతిని గొనివారి
మాన భంగముచేయుఁ । బూనువారు

కూటసాక్ష్యంబులే । కూర్చు గాఁదలచుక
 బరులఁ గొంపలు దీయ । నరుగువారు
పరమతద్వేషులై । దురిత కార్యములందు
 మనములఁ జొప్పించి । మసలువారు
లంచంబులం దాసలం । గొంచు నిరపరా
 ధుల హింసలఁ బెట్ట । దలఁచువారు
చోరులై నీతి జాఱి । విదూరులై స
దా విరామ మెఱుఁగని । ద్రాగుబోతు
లై ప్రపంచంబు గలచెడు । నట్టిఖలులు
గలరు నీధాటి కాఁగగా । గలుగువారు !

అట్టిమహనీయులెందఱో యుండ నీ కీ నిరపరాధి యొక్క దేహాహారం బునకుఁ జిక్కెనా ! అగ్నిహోత్రుఁడా! ఇది బుద్ధిగాదని నీ వాయింద్రుని జీవాట్లు పెట్టుటకు మాఱుగా ధర్మాధర్మ విచారశూన్యుండవై యమ్మందలి భస్మీభూత మొనర్చుటకు వానికి బాసటవైతివా ? ఇంత మాత్రమున నీపగ తీఱకుసుమా ! ఏమందువా ! మాభస్మము నే కైలాసవాసుఁడు తన శరీరమున నలఁదుకొనును. ఆవిధముగనైన మా యిష్టార్థ మీడేర్చినవాడవే యగుదువు ! (అగ్నిహోత్రునుఁజూచి) అయ్యో ! చితిమంత తీక్ష్ణముగఁ ప్రజ్వరిల్లుచున్న యది నాజీవితే శ్వరుఁడేఁకి ? నానవమోహనాంగుడేఁకి ? ఓ ప్రాణేశ్వరా ! నీవింక నాకుఁ గానఁబడవా ! నిన్నెడఁబాసి యెట్లు క్షణముండగలనా! ఓ దేవేంద్రుఁడా ! ఎంత కార్పణ్యము వహించితివి ! దేవకాంతలారా ! మీ రీగతి ద్రో హమొనర్చి నాకును నామనోహరునకును నెడఁబాటుఁ జేతురా! ఇది ధర్మమేనా! నాజీవితము, నాసుఖము మీకుఁ గంటకమయ్యెనా! ఇంద్రా ! నీజన్మమంతయు నిట్లు దుష్కార్యాచరణముతో సరిపోవల సినదేనా! నీకింక బుద్ధికలుగదా! ఓ త్రిలోకాధారా ! నాజీవము లింక

నాగననుచున్నయవి నీకు నాతనువును మనఃపూర్వకముగా నర్పించుచు న్నాను. నామానసంబును నీలో నైక్య పరచుచున్నాను. నాకరములు నీచరణములపై నుంచుచున్నాను. త్వన్నామభజన నేటితో దీఱినది. నీపూజ యీనాటితోడ నంతరించినది. ఇంతదనుక నిన్ను మఱువలేదు. నీటముంచినను పాలముంచినను భారమంతయునీది. దేవా ! నీకొఱకై యెంతటి పవిత్ర మాధిరంబును నెలకొల్పితినో, ని న్నేవిధంబుగ నలం కృతునిం జేసి భజించితినో నీవెఱుంగనిదిగాదు. నాపై జాలిఁగొనుము. పితిహూోత్రా! మంచియో చెడ్డయో తలంచితిరి. నీసాహసకార్యంబు నకు నేనడ్డురాను. మధ్య మఱల నీపిఱికితనమును బయటపెట్టక నే నా శివసాయుజ్య మందువఱకు నీపరాక్రమము జూపుము. ఆమోక్షసా మ్రాజ్యమును చేరుకాల మింకెంతగలదో యని పరితాపపడుచున్న నా కింత త్వరలో సంసార విముక్తురాలిని గావించినందులకు యిదిగో వందన శతంబు లర్పించుచున్నాను. ఓదయామయా ! పరాత్పరా !

వేశ్యమాత—(గుండెల బాదుకొనుచు వచ్చి) అమ్మా ! అమ్మా ! యీముసలిదొాక్కను వదలిపోయెదవా. అయ్యో! నేనింక నేమి చూచుకొని బ్రతికెదనే తల్లీ. నాకేదిదిక్కు తల్లీ ! నీ వింతసా హసమొనరింపవద్దు. నన్ను దిక్కుమాలిన దానినిగాఁజేయ వలదు. అమ్మాయీ ! నామాటవినుము. నాకుఁగడుపు మంట దేరుము.

మహా—తల్లీ ! ఎందులకమ్మా! విచారపడియెదవు. నేను శివసాయుజ్య మందఁబోవుచుంటిని. నాజీవితేశ్వరుని కలువఁ బోవుచుంటిని. నాభర్తతో నేను వెడలి సుఖపడుట నీకానందము కాదటమ్మా ! నీవునాతల్లివైనందులకున న్నాథ బ్రతుకు బ్రతుకుమనియెదవా! నేను చేయనున్నది పవిత్రమగు కార్యము. నా కీయల్పప్రాయము ననే యింతటి మహాత్కృష్టదశ ప్రాప్తించుటచే నేను ధన్యు

రాలనుగదా ! నీవుకంట నీరుపెట్టుకొనఁ దగిన సమయమా !
తల్లీ! నేను వేగిరవడవలయును. చూఁడు మల్లదె !

గీ. పీతిహూోత్తుఁడు కరములు । విప్పి నాకు
స్వాగతంబిచ్చెడిని తల్లి । వనరకమ్మ
వేగసెలవిచ్చి నన్నుఁబం । పించుమమ్మ
మెట్టినింటికిఁ బతికి నే । మేలుగూర్ప.

గీ. కూతురే పుట్టలేదను । కొనుచు చిత్త
మెప్పు డాయీశునిర్ భజి । యించు టందె
గాలమును బుచ్చుచుర్ ముక్తి । గనుటకొఱకు
యత్న మొనరింపుమమ్మకృ । పాంబురాసి.

గీ. శివునిమందిరమును పరుల్ । చెఱుపకుండ
దగినవారల నియమించి । దానిరక్ష
ణంబునకు నిమ్మ నీసర్వ । సంబు తల్లి
నాకొసంగిన యట్లె స్వాం । తమునఁదలతు.

నీవుఁగూడ నాప్రేరణవల్ల సదా శివునారాధించుంటివి. కాన నమ్మహా నీయుఁడు నిన్నుఁగూడ నాదరింపకఁబోడు. మఱల నతిత్వరితంబున నా కైలాసవాసు సన్నిధినిఁబుసర్దర్శన భాగ్యంబు లభించుచుండ నీ రవంత కాలమునకే యింత బెంగఁగొన నగునా !

వేశ్యమాత—అమ్మా ! నీవెంత జెప్పినను నాకు దుఃఖ మాఁగకున్నద మ్మా! నే నెంత గావిలవించుచున్నను ఎంతని మొరవెట్టుకొ న్నను నాపైఁగరుణ వహింపవా ?

మహా— తల్లీ ! నామాట వినకుంటివేమి ! దేనికొఱకై యింతకాలము పాటుపడితినో అక్కార్యంబు నేను నెరవేర్చితినుగదా యని సంత సించుచుండ నాయత్నంబున కీఱుల దుఃఖించి యంతరాయము

గల్గింప న్యాయమమ్మా! ఎప్పటికేనియు నీజీవికి నిర్యాణ మున్నదే గదా!

జాతస్య వాధ్రువోమృత్యుః ధ్రువం జన్మ మృతస్యచ
తస్మాన్ పరిహార్యార్థే నత్వం శోచితు మర్హసి.

అను గీతార్థము నీవెఱుంగవా! పుట్టినవారు గిట్టుటయు గిట్టినవారు పుట్టుటయు నిశ్చయము. కనుక యిందునగూర్చి విచారింప భాష్యముగాదని మున్ను శ్రీకృష్ణులవారే దెల్పిరమ్మా! వారిమాటలనే ప్రామాణికములుగా నిశ్చయించుకొనవలయును. జగదుత్పత్తి స్థితిలయ కారణీభూతుండగు పరమేశ్వరుని నియామకమును దప్పుటకు మనమెంత వారమమ్మా!

వేశ్యమాత—అమ్మా! నీవు చెప్పినవాక్యములు యదార్థములే గాని!

గీ. పుత్రికా రత్నముల మేము । పొందు టెందు
కమ్మ మాకింత యాధార మ । గుచు తలపు
కొలువి వెట్టి సంతోషంబు । గూర్తురంచు.
గాదె యా యాశలెల్ల భ । గ్నంబులయ్యె.

గీ. వయసుడిగిన వారలు । బ్రతికియుండి
పిన్న వారలముందు పం । పించుకొంట
లెంతదౌర్భాగ్యమో దాని । యంతనీచ
కంబికేదైన గలదె లో । కంబునందు.

మహా—కర్మానుభవములకు వగచి చేయదగినది లేదు. నీవు నీమూర్ఖమును విడువకున్నావు. నే నాగుటకుం గాలము లేదు. నేనింకం బోయెద. ఒక్క పరమార్థమును మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. ఏదనిన పూర్వజన్మమునందు మనమెవరమో యెఱుంగము పరజన్మంబున నెవ్వరము కాంబోవుచుంటిమో తెలియదు. ఈ విచిత్రజన్మమున మనము బంధులమైనను జచ్చునపుడొకరి

కొంకరు త్రోడ్కొనిపోవుటకల్ల. ఈమోహావిభ్రాంతులు తనువు లున్నంతవఱకే. ఈప్రపంచమేమిథ్య. ఈనాటకము నిజమైనదని భావింపకుము. తల్లీ యిదే నేను నీకుఁజెప్పఁదలఁచుకొన్న యది. నేనుపోవుచుంటిని. ఇఁకనీవుమాటాడిన నామీఁదవొట్టేసుమా. నాకుఁబ్రతిబంధకము గల్పింపకుము. నాపైనాశవీడుము. పొమ్ము. (అని వీతిహోత్రుని వంకతిరిగి.)

గీ. ముక్తిదాయకుఁడా సాంబ । మూర్తిసింత
ధ్యానమొనరించి వచ్చుచు । న్నానుగాన
నాగ్రహించి చల్లాఱకు । మయ్య వీతి
హోత్ర! నాపైని సత్కృప । నుంచుమయ్య.

దండకము.

శ్రీమన్మహాదేవదేవా! గిరీశా! త్రిలోకాధనాథా! బుధస్తోత్రి శంభో! శివా! నిన్నుఁ గీర్తింప నేనెంతదానన్ భవద్దాసురాలన్ మొఱాలింపవయ్యా! కృపన్ జూపుమయ్యా నినున్ దప్ప నే నన్యదేవున్ భజింపంగ లేదయ్య! నాగేశ శిర్యాలభూపాలు శోధించి రక్షింపవే మున్ను భిల్లుండవై జిష్ణుతోఁ బోరి దివ్యాస్త్రదానంబుఁ గావించి రక్షించి గౌరీసతిన్ మోదముందింపవే తొల్లి బన్నంబులెన్నోమహా ధైర్యచిత్తుండు నై దాటి సత్యవ్రతంబే జయంబంచు నీతిన్ బ్రబోధింపఁ గారుణ్యదృష్టిన్ విలోకించి నీదర్శనంబున్ బ్రసాదించి ధన్యాత్మునిన్ జేయవే శ్రీహరిశ్చంద్రునిన్ శంకరా! దీనపోషా! దయాసింధు! ఆపన్నురాలన్ ననున్ సత్కృపన్ జూచు కాలంబువచ్చెన్ గదయ్యా! సదా దీనరక్షుండవౌ నీకు నన్నుద్ధరింపంగలెక్కా! కృపాహీనుఁడై వీతిహోత్రుండు యొంతెంతఁ జేయంగ నుంకించుచున్నాఁడొ వీక్షించితే కన్నతండ్రీ! హరా! సారమింతేని లేనట్టి సంసారబాధల్ పడన్ జాలనయ్యా యనాధస్థితిన్ జీవ

ముల్ నేభరింపంగ లేనయ్యా! ప్రాణేశుఁ డేదారిసిఁ బోయె నాదారినే బోయి వానిఁ భజింపంగ నీ యగ్నిలోనఁ బ్రవేశింప నున్నాను నా నాథునిఁ జేర్చి ముక్తిఁ బ్రసాదించి నాజన్మ సార్థక్యముఁ జేయుమా! తాను క్రోధత్వముఁ జూపి మాయిర్వురిఁ గాల్చి భస్మంబునుఁ జేసినఁ గాని దానిఁ ముదంబాఱనే మొంటికిఁ బూసికొందంచుసంతోషముఁ జెంది తాఁజేయుచున్నట్టి కార్యంబు సాయించె యేగాని దోసంబు గాదంచుఁ గీర్తించుచున్నాను. స్వామీ! యిటుల్ గానిచో నింక నేనెంత కాలంబు మాయాంధకారంబులో మగ్గగా నౌనో దేవా! మహాధైర్య చిత్తుఁడుగా జేసి యీగీతిహోత్రుఁ కటాక్షించి ప్రోత్సాహమీయంగ దేవన్ను నీసన్నిధిఁ జేర్చి మన్నింపవే! సార్వభౌమా! దయాసాంద్ర! సాంబా! నమస్తే నమస్తే నమస్తే నమః

(అని యగ్నిలో దూకును.)

(తెఱవాలును)

---

కైలాసము.

(ప్రవేశము :—శివుఁడు, పార్వతి, నారదుఁడు, మహానంద)

శివు—నారదా! ఎంత విచిత్ర నాటకమాడించితివి?

సీ. పురిఁగొల్పి యీ పురం । ధరునిమోహాబ్ధిలో
ముంచి యీమెకడ కం । పించినావు
అతఁ డట పొందిన । యట్టిగౌరవవార్త
వచ్చి వింతగ నాతో । బల్కినావు
బల్కి నన్నట కేగి పరీక్షఁ । బరీక్షింప
వలయునంచుఁ బ్రబోధ । పరచినావు
మరల నావార్త యా । సురలోకపతికి నం
దించి యాతనిమెప్పుఁ । గాంచినావు

వినుకుబూనవు తిరుగఁగఁ । గ నరుకొనవు
వారిపేర్మిమాటల వింను । నారదా శ్రీ
మంబనఁగ నీదెగాదె లో । కంబులెల్ల.
జేతిలోనింపుకొంచు । చెలఁగినావు.

నార—దేవా! మీ రూరక నన్నుగ్గించెదరు గాని దేవరకుఁ దెలియని యంశ మీ చతుర్దశ భువనంబులయందుఁ గలదా ?

శివుఁడు—దేవి ! పార్వతీ ! నన్నీ మహానంద యుల్లర్ఘించినది.

శివతపపరిచర్యా సన్నిధానాయగార్యా
భవమనుగుణ ధుర్యాంబుద్ధి కన్యాంపిదాసే
సకలభువనబాధో సచ్చిదానందసింధో
సదయహృదయగేహం సర్వదాసంవసత్వమ్.

అని యిందుల కేమందువు ?

పార్వ—ప్రాణేశ్వరా! కార్యములన్నియు నెరవేరిన పిమ్మటనా నా యభిప్రాయ మడిగెదరు !

గీ. వర్తకుని వేష మూని యీ । వనిత భక్తి
చూడఁగాఁగోరి పోయెను । నాథు నాను
మాటఁగొనిపోయిరే దేవ । యేటికిట్లు
బల్కెదరు మీరు సాంబశి । వా! మహాత్మ.

శివు—అదియా నీ కోపము. దానికేమి? ఆరహస్యమావలఁ దెల్పెదను. మహానందా! నీపరిచర్యకుఁ దగినఫలమందితివా? ఇదియే కైలాసము ఇందుండి నీవు నీ యిష్టార్థంబులన్నియుఁ దీర్చుకొనవచ్చును. నీ పీ గారీసతితోడఁగలసిమెలసి వర్తించవచ్చును. నీచారిత్రము ముల్లోకంబులయందు స్థిరముగా నాటుకొనఁ బడినది. నీ నిష్కళంక పరివర్తన మీవేశ్యకులంబున వన్నె కెక్కినీతిమార్గముగనుండఁ గలదు. నిన్నెన్నో విధంబులఁ బరిశోధించి

కష్టపెట్టితినని నీభావంబునం దుంచుకొనకుము. మఱియు నో కాంతామణీ! ఆ విధిని శంకరశ్రేష్ఠి నామమున ముత్యాల వ్యాపారిగుచు వచ్చి నిన్నర్థించి నీపొందుఁగోరినది, నీమనోభీష్టం బీడేర్పదలంచినది నేనసుమీ. దేవేంద్రుఁడు కుత్సిత స్వభావుఁడై ప్రవర్తించినను యాతని దుర్మార్గ కృత్యములే నిన్నల్పకాలమున నాసన్నిధికిఁ జేర్చుకొనుట కవకాశముఁ గల్గించినవి. నారదుని త్రిలోకసంచారముఁగూడ నీయత్యద్భుత జీవితమును ప్రదర్శించుటకు సహాయపడినది. అందుచే నీవు నారదుఁడును, దేవేంద్రుఁడును, అగ్నిదేవుఁడును చిరస్మరణీయులే గాని యపకారులని దలంపఁబోకుము. నారదా! నీవు నాఁడు భారతమాత విలాపమునుగూర్చి యొసంగిన యుపన్యాసమునకు ఫలితంబునుగంటివిగదా! యింక నేఁ జేయఁదగిన దేమైనఁగలదా?

నార — లేదా! మఱి,

గీ. వెలవెలందుల వ్యభిచార । వృత్తి మాని
పెండ్లి జేసుక వారి జీ । వించు మనుచు
తగు ప్రబోధము గావించి । దనరు దేశ
భక్తుల యభీష్టములఁ దీర్ప । వలదె దేవ!

వెండియు,

గీ. దుఃఖసాగరమున మున్గి । తోడివారి
లోన దలయెత్త లేకఁ గు । ళ్లుమను నున్న
భారతాంబను సంతోష । పఱుపవలదె
యాపె మొఱలన్ని వినుచుఁ గృ । పాంబురాశి.

అంతియే గాక

గీ. భక్తులచరిత్రములు వ్రాసి । పామరులకు
నీతి గఱపెడు కవుల । మన్నించి వారి

కృతులు లోకంబునందున । గీర్తిఁ బడయ
చేసి చిత్తములను శాంతి । జేయవలదె.

శివు—నారదా ! ఇతియే నా ?

మహా—దేవా ! నారదులవారొక్కటి మాత్రము మఱచినారు. దానిని గూడఁ గటాక్షింపవలయును.

శివుఁడు—మహానందా! ఏదియది ?

మహా—దేవా!

గీ. తెలిసియో తెలియకో నన్ను । దేవవిభుఁడు
గౌరి యందుల ఫలితంబుఁ । గుడిచినాఁడు
చాలు వానికి శిక్ష ర । క్షణమొనర్చి!
దేహకాంతిని దేఁ బ్రిసా । దింపవలయు.

శివుఁడు.—దేవీ! ఈ మహానంద యింతటినుండి నీసేవ లొనర్చుకొనుచు నిందే యుండును. నారదా! ఈ సాధ్వీమణిని నాసన్నిధి నుంచు కొనుట కేయభ్యంతరమునుఁ లేదుగదా?

నార—తామః మఱల దేవేంద్రునకు యథారూపం బిచ్చుటచేఁ గాబోలు మహానంద యద్భుత చారిత్రమున కచ్చెరువందుచుఁ దమ సాయంబును గొనియాడుచుఁ దేవతలు బుష్పవర్షమును గురిపించుచున్నారు. అటుఁజూడుఁడు. అట్టియెడఁ దమ నియామకమున కభ్యంతరముండునా?

పార్వ—అట్లయిన నారదా! మహానంద! మీ యభీష్టములన్నియు నెర వేరుఁగాత యని నే నాశీర్వదించుచున్న దానను.

శివు—తథాస్తు.

సంపూర్ణము.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA115B173 |
| పుస్తకం పేరు | మహానంద |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 87 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | 1 |
| లేని పేజీలు | 41 to 48 |
| తయారు చేసినది | Habeeba |
| పేజీలు విడదీసినది | Navya |
| స్కాన్ చేసినది | thasia |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |